206

# పరివర్తన

## హిందీ కథల సంపుటి



కథా ప్రచురణ

# పరివర్తన

[హిందీ కథలసంపుటి]

"అజ్ఞేయ్" ప్రేమచంద్,
భగవతీచరణవర్మ,
భగవతీప్రసాదవాజపేయి,
"బెనీపురి" యశపాల్,
"వల్లభ్"



అనువాదం: "వల్లభ్"



కథా ప్రచురణాలయం
విజయవాడ-2.

# కథకుల పరిచయం

"అజ్ఞేయ్": పేరు సచ్చిదానంద హీరానంద వాత్స్యాయన్. జననం, 1911 లో. రచన, 1932 నుండి. సర్వతోముఖప్రతిభాసంపన్నులు. రచనలలో 'ఇత్యలమ్'(గేయాలసంపుటి) 'కోఠరకీబాత్' (కథాసంపుటి) శేఖర్ : ఏక్ జీవనీ (నవల) మొదలగునవి ప్రాముఖ్యతను పొందాయి.

ఈ రచయిత ప్రాచీన ఆచారవిచారాల బూర్జువాపంథాశకటాన్ని కూలద్రోసి, దాని స్థానంలో నవ్యమానవ సిద్ధాంతం ప్రకారం, గంటకు అరవై మైళ్ళ వేగంతో నడిచే మోటారు కారును నడిపించాలని చూస్తూవుంటారు.

ప్రేమ్‌చంద్ : పేరు ధనపతిరాయి. ప్రేమచంద్ పేరుతోనే వ్రాసారు. జననం, 1890 లో. రచన, 1914 నుండి. మరణం 1936 లో. కవిత్వం మినహా అన్ని రంగాలలో తన ప్రతిభను చాటి 'నవలా సామ్రాట్టు' బిరుదును పొందిన ఈ రచయిత రచనలు దేశీయ భాషలన్నింటిలోనూ, ఇంగ్లీషులోనూ అనువదించబడ్డాయి.

వీరి రచనలలో సమాజంలోని కుళ్ళు, అవినీతి, అజ్ఞానం-అన్నీ కూడా కళ్ళకు కట్టినట్టు చిత్రించబడ్డాయి.

భగవతీచరణవర్మ : జననం, 1903 లో. రచన 1921 నుండి. ముందు కవిగాను తరువాత కథకులుగాను, ఆ తరువాత నవలారచయితగాను, చివరకు సంపాదకులుగాను ప్రసిద్ధి చెందిరి. వీరి రచనలలో 'చిత్రలేఖ' బాగా వ్యాప్తి చెందింది.

వీరు అభ్యుదయ, మనోవైజ్ఞానిక దృక్పథంతో జీవిత సమస్యలను చూచి, పరిష్కారమార్గం వెతుకుతూవుంటారు.

భగవతీప్రసాద వాజపేయి : జననం, 1899 లో. రచన 1924 నుండి. సర్వతోముఖప్రతిభాసంపన్నులు. రచనలలో 'పతితకీ సాధనా' 'పిపాస' (నవలలు) బాగా ప్రచారంలో వున్నాయి.

వీరి రచనలలో సాంఘిక సమస్యలతోపాటు, మనోవైజ్ఞానిక, సెక్సు సమస్యలకుకూడా ప్రాధాన్యత వుంటుంది.

'బెనీపురి' : పూర్తి పేరు రామవృక్షబెనీపురి. హిందీసాహిత్యంలో 'స్కెచ్'లు వ్రాయగలవారిలో ప్రథములు. కవిత్వం వ్రాయటమున్నా, కథలు వ్రాయటమున్నా మంచి వుత్సాహం. వీరి 'నారి' బాగా ప్రసిద్ధి పొందింది.

వీరి రచనలలో సోషలిస్టు దృక్పథం కానవస్తుంది. సోషలిష్టు దృక్పథంతోనే జీవిత సమస్యలనుగూర్చి ఆలోచిస్తావుంటారు.

యశపాల్ : జననం, 1903 లో. రచన 1938 నుండి. రచనలలో 'దేశద్రోహి' (నవల) ఓ దునియా! (కథాసంపుటి) బాగా వెలుగులోకి వచ్చాయి. వీరిది సామ్యవాద దృక్పథం. ఆ దృక్పథంతోనే వ్రాస్తావుంటారు. అందువల్లనే ఏమో! రచనలలో ఆవేశం ఎక్కువగా వుంటుంది.

వల్లభ" : పేరు వల్లభనేని సుబ్బారావు. జననం 1931 లో. స్వయం కృషితో హిందీ తెలుగు భాషలలో ప్రావీణ్యత సంపాదించారు. కవిత్వమన్న అభిరుచి ఎక్కువ. వీరి మొట్టమొదటికవిత్వం సమీక్షలో వెలువడింది. త్వరలోనే వీరి గేయనాటికలసంపుటి 'అన్యాయాలు' వెలువడుతోంది.



## అంకితం

నారాయణరావుకి

వివాహ సందర్భంలో

"అజ్ఞేయ్"

# పరివర్తన

ప్రభాకర్ తనకోటుక్రింద రివాల్వరుకట్టుకొని, జేబులో పడివున్న గుండ్లను తడుముకుంటూ, నిలువుటద్దం ఎదుట నిలబడ్డాడు. అద్దంలో కనబడుతున్న తన ప్రతిబింబాన్ని చూచుకొన్నప్పుడు మాత్రం అతని మోముపై మందహాసము ఒక్క క్షణంపాటు బసచేసింది. బయటకు బయలుదేరబోతుండగానే రజని "ఏమండీ! త్వరగావస్తారా?" అంటూ ప్రత్యక్షమయింది.

ప్రభాకర్ రజనివైపు చూస్తూ—"ఇప్పుడే,— ఒకఘడియలో తిరిగిరానూ? ఏం ఆకలివేస్తోందా?" అని అడిగాడు.

"లేదు...ఆఁ...పూరకనే..." అంటూ నీళ్ళు నమిలింది రజని. రజనిమాటలు విన్న ప్రభాకర్‌కి నవ్వువచ్చింది; కాని, దానినిక్రమింగేయటానికి ప్రయత్నించాడు. ఎంతగాప్రయత్నించినను ఆనవ్వు పెదిమెలమధ్యగుండా తొంగిచూచిపోయింది.

ప్రభాకర్ వెళ్ళిపోయాడు. అతనిబూట్లధ్వని వింటూంటే రజనీకి గుండెల్లో రైళ్ళుపరుగెత్తినట్టుంది; ఒక నిట్టూర్పువిడిచింది.

ఆమెకు మేజాబల్లమీద తెరచుకొనియున్న, హేరాల్డ్ లాస్కీ రచించిన 'కమ్యూనిజం' తనను వెక్కిరించినట్టుంది. దానిని మూసివేసి భవభూతి రచించిన 'ఉత్తర రామచరిత'ను తెరిచింది. కలవరం పొందిన తన మనస్సునకు శాంతిని కలుగచేయటానికే నేమో! క్షణక్షణానికి ఆలోచనాతరంగాలు తాకుతూవుండగా శాంతి ఎక్కడిది? విశ్రాంతి ఎక్కడిది?

ప్రభాకర్ రజనీల వివాహం జరిగి రెండు సంవత్సరాలయింది. కాని యింతవరకు ఆమెకు వైవాహికసుఖం ఎట్లా వుంటుందో బోధపడలేదు. ఆమె ఈ రెండు సంవత్సరాలలోనూ సైనికుల జీవితం ఎంత కఠోరంగా వుంటూ—దేశం కోసం, జాతికోసం బలవుతూ వుంటుందో మాత్రమే తెలుసుకోగలిగింది. ఈ రెండు సంవత్సరాలలోనూ ఆమెపొందిన అనుభవం యిదే!

రజని సంపన్నకుటుంబీకురాలు. ఆమెపొందిన ట్రైనింగ్, ఆమె చుట్టూవున్న వాతావరణం — రెండూ ఆమెకు తోడ్పడ్డాయి — ఆమెకు ప్రతి వస్తువును గురించి, ప్రతివిషయాన్ని గురించి ఒక నిశ్చితాభిప్రాయానికి రావటానికి సాయపడ్డాయి! ఆ తరువాత వివాహం అయింది. భర్తయింటికి వచ్చింది. వాతావరణం మారింది. పొందిన ట్రైనింగు వ్యర్థమయింది. ఆమె హృదయంలో బసచేసిన భావాలు తద్వారా జనించిన ఆలోచనలు రెక్కలు లేని పక్షివలె నిరాధారాలయ్యాయి: ఇక్కడ రాజరికమన్నా పరిపాలకుల నిష్పక్షవైఖరి యన్నా బొత్తిగా విశ్వాసములేదు. వారిస్థానంలో కూలీలకు కార్మికులకు ఎక్కువ గౌరవ మీయబడుచున్నది. మొట్టమొదట్లో యిదంతా చూస్తూంటే వొళ్లు మండినప్పటికీ తరువాత తరువాత మారిపోయింది. తనకు తెలియకుండానే తనలో వస్తున్నమార్పును ప్రభాకర్ దగ్గర దాయటానికి ప్రయత్నిస్తుండేది. పాత ఫక్కీలోనే వాదిస్తుండేది. తనను బలపరుచుకోటానికి

కాలేజి పుస్తకాలనుండి కొన్నిమాటలను యెత్తి చూపెడుతూ వుండేది. కాని ఫలితం వుండేదిగాదు. ఎప్పుడూ విజయ లక్ష్మి ప్రభాకర్ నే వరిస్తూవుండేది. చెప్పేది, చేసేది లేక నిశ్చేష్టు రాలైనప్పుడు ప్రభాకర్ ఆమె చెక్కిళ్లమీద చిటికేసి- "రజనీ! యింకా నీవు మారతావు; యింకామారాలి. నిన్ననే దేముందిలే! మీ సమాజం నిన్ను ఆవిధంగా తయారుచేస్తే" అంటూ ఆమెలో వచ్చే పరివర్తనకు స్వాగతవచనాలు పలు కుతూ వుండేవాడు.

ప్రభాకర్ తల్లిదండ్రులు చనిపోయారు. లాహోరులో అతడొక చిన్న ఇంట్లో ఒంటరిగానే నివసిస్తున్నాడు. అతడు ఒక లెక్చరర్. అతనుండే యిల్లు ఆకలితో అటమటిస్తున్న మానవుల పూరిగుడిసెల మధ్యలోవుంది. ఉదయం లేస్తాడు. కాలేజికినోట్సు తయారుచేసుకుంటాడు. ఇక మిగిలిన సమ యంలో రాజనైతిక, ఆర్థిక విషయాలకు సంబంధించిన పుస్త కాలను చదువుకుంటాడు. పదిగంటలైన తరువాత భోంచేసి కాలేజికి వెళ్లిపోతాడు. ఇక మరల యింటికిరావటం రాత్రి తొమ్మిదిగంటలకే. ఇక యీ మధ్యకాలం రజనికి ఓ మహా యుగంలా గడుస్తుంది. అప్పుడప్పుడు రజని "యిప్పటివరకు ఎక్కడ వున్నారండీ?" అని అడిగితే నవ్వుతూ-"నేడు విద్యా ర్థుల సమావేశం జరిగింది. అక్కడికు వెళ్లక తప్పిందిగాదు." అనో; లేక-"నేడు ఫలానామిల్లు కార్మికులు పిల్చారు. అందు వలన రాలేక పోయాను" అనో చెబుతూవుండేవాడు.

రజనికి ప్రభాకర్ పుస్తకాలన్నా, ఆశయాలన్నా యిష్టం లేదు. ఎప్పుడైనా చదువమన్నా, చదవమని పుస్తకాలిచ్చినా "ఆఁ యివికూడా యెందుకులెండి! యింతమాత్రానికే యింత తీరుగావుంటే యింక అవికూడా ఎందుకులెండి!" అంటూనే వాగ్వివాదాన్ని ఆరంభించేది.

కాని, ప్రభాకర్ కాలేజీకి వెళ్ళిపోయిన తరువాత రజని ఆ పుస్తకాలనే చదువుతూ వుండేది. అంతేకాదు. ప్రభాకర్ వచ్చేలోగా తన చదువును ముగించేసే ప్రయత్నంలో వుండేది.

నెమ్మది నెమ్మదిగా ఆమె ఆలోచనలు, వూహాగానాలు, విస్తృత మవుతున్నాయి. ఆమెకు యెన్నో విషయాలు తెలుస్తున్నాయి. గత వాతావరణం పోయింది. క్రొత్తవాతావరణం ఏర్పడింది. ఆమె భావాలుకూడ రోజు కొక విధంగా మారుతూ వున్నాయి. భావాలు మారిన కొలది అహంభావంపోయి, తెలుసుకోవాలనే కోర్కె కలుగుతోంది. కాని, గతకాలంలో ప్రభాకర్‌తో చేసిన వాదనలను జ్ఞప్తికి తెచ్చుకొని వచ్చిన మార్పును, వస్తున్న మార్పును దాయటానికి ప్రయత్నిస్తుండేది.

ఓరోజున ప్రొద్దుపోయేవరకు ప్రభాకర్ రాలేదు. రజని హృదయావేదన పెరిగిపోతోంది. ఆమె పైఅంతస్తుగదిలో కూర్చుని మనస్సునకు కళ్ళెముపెట్టడానికి ప్రయత్నిస్తోంది. ప్రభాకర్ షుమారు పదకొండుగంటలకు తలుపుతట్టాడు. నెమ్మదిగా —"రజనీ!" అని పిలిచాడు.

రజని వులిక్కిపడింది. క్రిందకుపోయి తలుపు తీసింది.

ఒకర్నొకరుకూడా చూచుకోలేదు. మాట్లాడుకోలేదు. రీడింగ్ రూమ్‌లోకి వెళ్ళారు. ప్రభాకర్ నెమ్మది నెమ్మదిగా కోటు వూడదీసి భుజంమీద వేసుకుంటూ కుర్చీలో కూర్చోబడ్డాడు.

రజని క్షణంపాటు ప్రభాకర్ వైపుచూస్తూ నిలబడి పోయింది. భోం చేయరా?" అని అడిగింది.

"భోంచేసే వచ్చాను."

"ఎక్కడ?"

ప్రభాకర్ జవాబివ్వలేదు. చిరునవ్వునవ్వి వూరు కున్నాడు.

"సరే! వెళ్ళి కాళ్ళూచేతులూ కడుక్కొని రండి! వంటి నిండా దుమ్ము!" అంది రజని.

"నీవు పద! నే నిప్పుడే వస్తున్నా!" అన్నాడు ప్రభాకర్. రజని ఏదో అసాధారణ సంఘటన జరిగి వుంటుందని వూహించు కుంది. ప్రేమతో—"పగలంతా ఎక్కడ వున్నారండి?" అని అడిగింది.

ప్రభాకర్—"అబ్బ! ఎంతగా అలసిపోయాను!"అంటూ సందర్భాన్ని దాటేయటానికి ప్రయత్నించాడు.

రజని అతని చెయ్యిపట్టుకొని—"రండి! పన్నెండు అవ స్తోంది" అని అంది.

ప్రభాకర్ కోటును సర్దుకుంటూ లేచి నిలబడ్డాడు. "దీనిని యిక్కడనే వుండనివ్వండి! రేపు నేను సర్దుకుంటానుగా!" అంటూ కోటు లాగింది.

కోటు క్రిందపడింది. యేదో యినుపముక్క పడ్డట్టు చప్పుడయింది. "ఇదేమి"టంటూనే ప్రభాకర్ అడ్డగించి నప్పటికి జేబులో చెయ్యిపెట్టింది.

ప్రభాకర్ 'ఏమీలే'దని చెబుదామనుకున్నాడు. కాని యిక ఫలితంలేదనుకొని ఆగిపోయాడు.

రజని నిర్విణ్ణురాలైంది. ఆమె ముఖంలో నెత్తురుచుక్క లేదు. ఎంతగానో ప్రయత్నించిన తరువాతనే తనను తనగది లోకి తీసుకురాగలింది. కోటును తీసుకొని తనగదిలోనికి వెళ్ళింది. ప్రభాకర్ కూడా ఆమె ననుసరించాడు.

గదిలోకి వెళ్ళిన తరువాత రజని కోటుజేబునుండి రెండు పిస్తోళ్ళను అడుగు బొడుగున వున్న గుళ్ళను తీసింది. వాటిని తీసుకెళ్ళి వెంటనే తనచీరలలో దాచింది. "వీటిని మీ రెందుకు తీసుకొచ్చారు?" అని ప్రభాకర్‌ని అడిగింది.

ప్రభాకర్ వెంటనే జవాబివ్వలేకపోయాడు. కొద్దిక్షణాలాగిన తరువాత శబ్దాలను ముందుకు తోసినట్టు "నేను గదర్ పార్టీలో చేరాను" అన్నాడు.

రజని ప్రభాకర్‌నిచూస్తూ నిలబడిపోయింది. కొన్ని క్షణాల తరువాత "మీకు మీరు మినహా యితరులు కూడా గుర్తుంటారా?" అని అడిగింది.

ప్రభాకర్ అప్పుడుకూడా మాట్లాడలేదు.

రజని "నే నిప్పుడేమీ మాట్లాడలేను! వెళ్ళండి!" అంది. ప్రభాకర్ వెళ్ళిపోయాడు.

ఆ తరువాత రజని వారంరోజులవరకు భర్తతో మాట్లాడ లేదు. ప్రభాకర్ కూడా మాట్లాడటానికి సాహసించలేక పోయాడు. అతనే స్వయంగా వంటచేసుకు తినేవాడు. కాలేజీకి వెళ్లేవాడు. అప్పుడప్పుడు రజని వైపుకి దైన్యదృష్టితో చూస్తూ వుండేవాడు. కాని మాట్లాడేవాడుకాదు. రజని ఎప్పుడూ కంటితో నన్నా ఏమీ జవాబిచ్చేదికాదు.

ఎనిమిదవరోజున మరల ప్రభాకర్ ప్రొద్దుపోయే వరకు యింటికిరాలేదు. షుమారు పన్నెండుగంటలకి తలుపు తట్టాడు. కాని రజనిని పేరుపెట్టి పిల్వలేదు. తలుపులు తెరిచిన తరువాత తన గదిలోకొచ్చి పుస్తకాలు, బట్టలు సర్దుకున్నాడు. రజని యిదంతా చూస్తూ నిలబడింది.

ప్రభాకర్ తన పనిపూర్తయినతరువాత ఆవలించుకుంటూ ఒక్కక్షణంపాటు నిలబడిపోయాడు. ఏమేమో చెప్పాలను కుంటాడు కాని మాట పెగలదు. చివరకుఏదోవిధంగా ధైర్యం తెచ్చుకొని "రజని!ఇంకాఇప్పుడుకూడామాట్లాడవా?"అన్నాడు.

"ఇప్పుడు కూడా, అంటే?" రజని భయపడింది—"ఇప్పుడు వచ్చిన మార్పేమిటి?" అని అడిగింది ఆతురతతో.

"రజని! నే నింతవరకు నీతో చెప్పటానికి సాహసించలేక పోయాను" అన్నాడు ప్రభాకర్.

"పైకి పదండి; అక్కడకుపోయి మాట్లాడుకొందాము" అంటూ రజని బెడ్ రూమ్‌కి దారితీసింది. ప్రభాకర్ కూడా ఆమెను అనుసరించాడు.

ప్రభాకర్ ఏం భూమిక కట్టకుండానే—"రజని! నేను ఇల్లువదిలి పారిపోవాల్సి వచ్చేటట్టుంది. నాపేర వారంటు వచ్చింది" అన్నాడు.

ఈ సంఘటన జరిగిన తరువాత ఆరుమాసాలు గడచి పోయాయి. ఈ ఆరుమాసాలలోనూ రజని ఎన్నోమార్పులను చూచింది.

నేడు దీపావళి; కాని రజని యింట్లో దీపం వెలగలేదు. తింటానికి తిండిలేనప్పుడు పండగమాత్రం ఎందుకు? నిన్నటి రాత్రినే ఎవడో ప్రభాకర్‌ను బజారులో చూచాడు. చూచి వెంబడించాడు. అందువల్లనే ప్రభాకర్‌కి చుట్టుతిరిగి రావాల్సి వచ్చింది. యివ్వాళ బయటకి వెళ్లలేదు. కాని సాయంత్రం వరకు ఆకలితో సతమత మవుతున్న రజని "అబ్బ! యింత నీరసంగా వుందేమిటండీ, యీ సంవత్సరం దీపావళి?" మాటలు విన్న తరువాత ఒక్క నిమిషంకూడా కూర్చోలేక పోయాడు.

"నేను బయటికి పోయివస్తాను."

"ఎందుకు?"

"పనుంది?"

ఏంపనో రజనికి తెలిసింది. ఎందుకు అన్నానా అని పశ్చాత్తాప పడింది. "ఇతరులు చేస్తూంటే చూస్తూ కూర్చుందాం! పరుల ఆనందమే మన ఆనందముగా! అయినప్పుడు ఎందుకీ తాపత్రయం?" అని అడిగింది.

"ఇదేం వ్యంగ్యంకాదుగదా!" అంటూ ప్రభాకర్ రజని వైపుకి తిరిగిచూశాడు. కాని ఆమె ముఖంలో కానవస్తున్న నిర్మలమైన ప్రేమాదరాలను చూచి నాలుక కొరుక్కున్నాడు, ఎందుకు అన్నానా అని! "కాదు రజనీ! మనంకూడా తప్పక పండుగ చేసుకుందాము. నేనుపోయి అవీ యివీ అన్నీ తీసు కొస్తాను" అన్నాడు.

రజని ఏం మాట్లాడలేక పోయింది. ప్రభాకర్ వెళ్లి పోయాడు. రజని ఎదురుగానున్న అద్దంలో తన ప్రతిబింబాన్ని చూచి ఏమేమో ఆలోచిస్తోంది.

ఆమెకు తన వైవాహిక జీవితఘట్టాలు జ్ఞప్తికివచ్చాయి. హృదయాంబుధిలో ఆలోచనా తరంగాలు పీస్తున్నాయి; మరల లీనమవుతున్నాయి. ఆమె అప్పుడప్పుడు గడియారంవంక చూస్తోంది.

అరగంటయినది. ఆలోచనలలో కొట్టుకుపోతూవుంది. ఇదేసమయంలో యింటికి కొంచెందూరాన "ఢాం! ఢాం! ఢాం!" అనిమోత వినపడింది. కొద్దిక్షణాలవరకు శాంతి. ఆ తరువాత మరల నదేధ్వని. రెండుపర్యాయాలు. రజనివులిక్కిపడింది. ఒక్క గంతులో క్రిందకువెళ్లి తలుపువేసింది. ఇదంతా తనకు తెలియ కుండానే చేసేస్తోంది. తనగదిలోకెళ్లింది. ఆమె మనస్సు పరు గిడుతోంది......

మరల నదేధ్వని, నాలుగైదు పర్యాయాలు. ఒక్క క్షణంపాటు శాంతి. మరల నొక పర్యాయం! ఆ తరువాత శాంతి!

ఒకవేళ ప్రభాకర్ పట్టుబడితే! లేక గాయపడితే...
రజని మనస్సు పరుగిడుతోంది...

ఆమె ఎంతగానో ప్రయత్నించిన తరువాత తన మనస్సును ఆపుకోగలిగింది. ఇప్పుడు తను ఏంచేయాలి! జరిగిం దాన్ని గురించి ఆలోచించినా ఫలితముండదని, జరగబోయే దాన్ని గురించి ఆలోచించటం అవసరమని తెలుసుకోగలిగింది... ఇప్పుడు తను ఏంచేయాలి?...

రజనికి ప్రభాకర్‌తో కలసి యింటిని వదిలినరోజు గుర్తుకొచ్చింది.

వారంరోజుల పూనంతరువాత ఒకరోజున ప్రభాకర్—
"రజని! నేను యింటిని వదలాల్సి వచ్చేటట్టువుంది. నా పేర వారంటు వచ్చింది" అని చెప్పినప్పుడు రజని దిగ్భ్రాంతురాలై ఏమీ మాట్లాడలేకపోయింది. కొంచెం సేపాగిన తరువాత—
"మరి నేనూ?" అని అడిగింది.

ప్రభాకర్‌కు తనకు యీ ప్రశ్నకు సమాధానం యివ్వాల్సిన బాధ్యత వుందని యిదివరకే తెలుసు. కాని, దాన్ని గురించి ఆలోచించలేదు. కొద్దిక్షణాల తరువాత నెమ్మది నెమ్మదిగా—"నీకు కూడా యేర్పాట్లన్నీ చూచుకున్న తరువాత నేనే పిలుచుకుంటాను" అన్నాడు.

"ఒకమాట చెప్తున్నాను. జాగ్రత్తగా వినండి! నన్ను మీ వెంట తీసుకెళ్తారా?" అని అడిగింది రజని. రజనికి యేం సమాధానం చెప్పి యెట్లా సంతృప్తి పరచాలో ప్రభా

కర్ ఆలోచించుకో లేకపోయాడు. ఆశ్చర్యంతో—"నన్నేనా, రజని!" అ నడిగాడు.

"అవును, నన్నే! నేను మీకు యెట్టి సహాయం చేయ లేను. చేయజాలనుకూడాను. కాని ఒక్కమాట, మీకు ఆటంకంగా మాత్రం వుండను. మీ విషయాలలో యెట్టి జోక్యం కలుగచేసుకోను. నాకు మీ రహస్యాలు తెలియవు. కాని తెలిసినా బయటపెట్టను."

"రజని! నీవు ఆమాత్రం చేయగలిగితే యెంతో సహాయము చేసినట్టే అవుతుంది. తప్పక తీసుకెళ్తాను. కాని నీవు మాత్రం బాగా లోతుగా ఆలోచించు; అనేక కష్టాలకు గురి కావాల్సివస్తుంది. అప్పుడు ఎంత పశ్చాత్తాపపడ్డా ఫలితం వుండదు."

ప్రభాకర్ మాటలు విని విననట్టుగా రజని—"నేను మీ వెంట వస్తున్నాను. అంతమాత్రానికే మీరు నేను మీ ఆశ యాలతో యేకీభవించానని మాత్రం అనుకోవద్దు! అది అసం భవం. మీ ఆదర్శాలు వేరు. ఇదిమాత్రం మరిచేపోవద్దు!" అని హెచ్చరించింది రజని.

"దీంట్లో మాత్రం నాకేం అపకారం లేదుగదా!" అంటూ నవ్వాడు ప్రభాకర

"అయితే! పదండి. పోదాం!" అంది రజని.

నిర్ణయించుకొన్న తరువాత రజని ప్రభాకర్ లిద్దరు బయలుదేరారు యెక్కడికో.....

నేడు 'ఢాం! ఢాం!' మోతవినగానే యీమాటలే గుర్తుకొచ్చాయి రజనికి. ఆమె తనలో తానే—"నేను ఏం చేయజాలను. ఏం జరగాలో అదే జరుగుతుంది" అని నిశ్చయించుకున్నది.

ఆమె మనస్సులో—గతిగల్గిన మనస్సులో ఈ నిర్ణయం పట్టుమంటూ పది సెకండులైనావుండలేదు. ఆమె ఆలోచిస్తూనే వుంది"—నేను పట్టుబడితే యేమవుతుంది?" ఆమె యెదుట అచ్చవుతున్న వార్తాపత్రికలు నోర్గాయి—"అమృతసర్‌లో విప్లవకారుడు పట్టుబడ్డాడు. (—లేక గాయపడ్డాడు) వీరుడైన (—లేక వీరగతిచెందిన) విప్లవకారుని భార్యకూడా పట్టుబడింది."

రజని గుండెల్లో రైళ్ళుపరుగెత్తాయి. మరల 'ఢాం! ఢాం!' మోత వినపడింది. ఆమె పెట్టె తెరిచింది. రివాల్వర్లో గుండ్లు నింపి, మిగిలిన వాటిని వొడిలో పోసుకొని, మొదటి అంతస్తుతలుపులకు గొళ్లెంపెట్టి పైభాగంలోకి వెళ్ళింది. అక్కడ కూడా తలుపులు మూసేసి, కిటికీక్రింద కమ్మిదగ్గరవున్న బెజ్జంలో రివాల్వరు కొనపెట్టి,—ఆ కొనకు తిన్నగావుంటుంది పైకొచ్చేద్వారం— కుర్చీవేసుకొని కూర్చుంది. యిదంతా కూడా తనకు తెలియకుండానే చేసుకుంటూపోతోంది. ఏదో అలౌకికప్రేరేపణవల్ల యిదంతా జరుగుతోందని ఆమె వూహించింది.

రెండునిమిషాలుకూడా గడవలేదు. ఎవరో తలుపులు తట్టారు. రజని తయారుగానే వుంది.

ఆమె మనస్సులో యెప్పుడువస్తారా, యెప్పుడు వేలు ద్దామా అన్న ఆలోచనతప్ప మరొకటిలేదు.

తలుపులను మరల గట్టిగా తట్టినధ్వని, కాని రజని జవాబివ్వలేదు; యిద్దామన్నా శక్తిలేదు.

అకస్మాత్తుగా రజని వులిక్కిపడింది. ఇది పోలీసులపిలుపు గాదు. అసలు పిలుస్తారా, వాళ్లు? ఎప్పుడూ వింటూన్న పిలుపే—"కళ్యాణీ! తలుపుతీయి!"

రజని క్రిందకు వెళ్ళింది. ఆమెకాళ్ళు వణకుతున్నాయి. మెట్లుదిగి క్రిందకువెళ్ళింది. కుడిచేతిలోనున్న రివాల్వరును మాత్రం వదలలేదు. చెయ్యి వెనుక్కిపెట్టుకొని తలుపుతీసింది. —"అరే! వచ్చేసారే!" అంది తనకు తెలియకుండానే! ఆమె కంఠం బొంగురుపోయింది. మాట్లాడుకోకుండానే పైకొచ్చేశారు—"రజని! స్వర్ణమందిరంలో యెంత హడావిడిగా, ఎంత మహదానందంగా వుందనుకుంటున్నావు? టపాకాయలు! అవ్వాయి చువ్వలు! నేను నిన్ను తీసుకెళ్ళలేక పోయానుగాని, నీబదులుకూడా చూచివచ్చాను" అన్నాడు ప్రభాకర్ నవ్వుతూ.

రజని దిగ్భ్రమచెంది ప్రభాకర్ వైపు చూచింది—"అవ్వాయి చువ్వలు, టపాకాయలూనా?" అంటూండగానే ఆమెచేతిలోనుండి రివాల్వరు క్రిందపడింది. ఆమెకూడా చతికిలబడ్డది.

రజనిని ప్రభాకర్ తన వొడిలోకి తీసుకుంటూ—"ఇదేమిటి?" అనడిగాడు

రజని నెమ్మదిగా తన తలను ప్రభాకర్ భుజాని కాసించింది. ఆమె కన్నీరు కారుస్తోంది.

ప్రభాకర్‌కు ఏమీ అర్థంకాలేదు. ఏంచేయాలో తెలియలేదు. కొద్దిక్షణాలలో రజని లేచికూర్చుంది. ప్రభాకర్ — "ఎందుకు, రజనీ?" అడిగాడు.

రజని—"దీపావళి పండుగ. దీపాలను వెలిగిస్తాను." అని లేచింది. ప్రభాకర్ సంతోషంతో—"మరి నేను నాగృహలక్ష్మిని పూజించుకోవద్దు?" అన్నాడు.



"అజ్ఞేయ్"

# శ త్రు వు

ఝ్హా ఒకరాత్రి నిద్రపోతున్న సమయాన భగవంతుడు దర్శనంయిచ్చి—"ఝ్హా! నిన్ను నేను నా ప్రతినిధిగా ప్రపంచం లోకి పంపాను. లే! వూరుకున్నావేం? ప్రపంచాన్ని ఉద్ధరించు" అని అన్నాడు.

ఝ్హా నిద్రనుండి మేల్కొన్నాడు. ప్రపంచం అంధకార బంధురమై మూల్గుచు పదభ్రష్టతచెంది వినాశమువైపుకి పోవు చున్నదని తెలుసుకున్నాడు. అతడు ఈశ్వరుని ప్రతినిధి. అందు వల్ల మానవజాతి నుద్ధరించవలసిన భారం అతనిమీద యెంతేని గలదు. జాతికి నాయకత్వం వహించి దాని శత్రువులతో పోరాటం జరపాలి అతడు. కాని ముందు జాతి అతని 'నాయ కత్వాన్ని స్వీకరించాలి గదా!' అందు కతడు ప్రజలతో సన్ని హితసంబంధ మేర్పరుచుకోనాలి. ఆ తరువాత వారి వాంఛ లను ఈడేర్చుటకు తనను త్యాగం చేయాలి. సెంటరులో కెళ్ళి నిలబడి అందరికి వినిపించేటట్లు—"నేను ఈశ్వరుని ప్రతినిధిని, ధర్మ ప్రవర్తకుడను. కాన నామాట వినండి; మీరు ఔన్నత్యం పొందగలరు" అని పెద్దగా అరిచాడు.

కాని, అతనిమాటలు వినే దేవరక్కడ? కొంతమంది అత నిని చూచి నవ్వారు. కొందరు పిచ్చివాడని; మరికొందరు— "వీడు ధర్మవిరుద్ధంగా చెప్తున్నాడు. నాస్తికుడు. వీడిని కొట్టం

డిరా!" అని హెచ్చరిస్తుంటే మరికొంతమంది కొడుతున్నారు కూడా.

◆ ◆ ◆

చివరకు విసుగుచెంది ఒక చీకటి సందులో దాక్కున్నాడు. అప్పుడు మానవజాతికి ఘోరమైన శత్రువు ధర్మమని, దానినే యెదుర్కొనుట ప్రథమకర్తవ్యమని అతడు నిశ్చయించుకున్నాడు

ఆ దగ్గరలోనే యెక్కడో ఒక స్త్రీ దయార్ద్ర రోదన ధ్వని వాని చెవులను బ్రద్దలుచేసింది. ఒక పిల్లవాడు భూమిమీద పడివుండటం చూచాడు. బహుశా! అతడు ఆమె కుమారుడేమో! ఆ పిల్లవానిలో సత్తువలేదు. సంచలనం కూడా లేదు. మూర్ఛిల్లాడో? లేక కాలదేవత అతని కష్టాలను చూడలేకపోయిందో? జ్ఞాన్—"సోదరీ యెందుకేడుస్తున్నావు?" అన్నాడు దీనంగా.

"నేను విధర్మితో వివాహం చేసుకున్నాను. ఈ విషయం అందరికీ తెలిసింది. వారు మా నిర్భాగ్యజీవుల ప్రేమసౌధాన్ని చూడలేకపోయారు. అతనిని చావగొట్టారు. నన్ను వెలివేశారు. ఇక నాకీ ప్రపంచంలో యిన్ని గంజినీళ్లు పోసేవారు ఎవరూ లేకపోయారు. వీడు! చూస్తున్నారా వీడిని! ఈ జీవచ్ఛవాన్ని!... వీడు నా కుమారుడే!... కాని వాడికి గంజినీళ్ళు పోయలేకపోయినదాన్నను నే నే విధంగా తల్లి ననిపించుకుంటాను?" అన్నదామె క్షీణస్వరంతో. జ్ఞాన్ నిశ్చయం యింకా

ధ్రువపడింది. — "నా వెంటరా, సోదరీ!" అని తీసుకెళ్లాడు తన వెంట.

జ్ఞాన్ మతం అంటే మండిపోయాడు. మతానికి విరుద్ధంగా ఉపదేశా లివ్వటం మొదలుపెట్టాడు—"మతం బంధనం! భగవంతుడు ఒక్కడే! వాడు స్వతంత్రుడు. వానికే మతంతో ప్రమేయం లేదు. మతం మన మానసిక శారీరక వికాసాలకు అడ్డుపడుతోంది. మనల్ని బంధనాల్లో బంధించి వేస్తోంది. అది మన శత్రువు!"

'పరాయి స్త్రీని, బహిష్కరించిన స్త్రీని తీసుకొచ్చి యింట్లో పెట్టుకున్న వాని మాటలు మేమెందుకు వినాలి? వాడు జాతి, సంఘనీతి నియమాలకు వ్యతిరేకే; మూర్ఖుడే;' అన్నారు ముక్తకంఠంతో ప్రజలు. సంఘం బహిష్కరించిందప్పుడు అతనిని. (ఎందుకంటే) ప్రజలే సంఘం! సంఘమే ప్రజలు.

♦ ♦ ♦

జ్ఞాన్ మతాన్ని యెదుర్కోటానికి ముందు సంఘాన్ని యెదుర్కోవాలని గుర్తించాడు. సంఘాన్ని జయించనంతవరకు మతాన్ని ఖండించలేం!" అనే వుద్దేశ్యంతో మరల వుపదేశా లివ్వటం మొదలు పెట్టాడు. సంఘాచారాల నెదుర్కొంటూ— "ఈ కపటనాటక పాత్రలు, యీ మూర్ఖపండితులు, స్వాల్వీలు, పురోహితులు, వీళ్లంతా యెవరు మన జీవితాల్ని బంధించటానికి? వాళ్లకేమి అధికారముంది మనమీద? మనమంతా

కలసి వీళ్లను నాశంచేద్దాం! సంఘం చీడపురుగుల్ని పార ద్రోలుదాం; స్వతంత్ర సమాన సౌభ్రాతృత్వ సిద్ధాంతాన్ని ప్రాతిపదికగా చేసుకొని సంఘాన్ని స్థాపించుదాం! అప్పుడే నవధర్మం, నవకళ, నవజీవితం:— ఇవే మనకాధారాలు" అని ఉపదేశాలివ్వ నారంభించాడు.

ఒక దినమున వర్గభేదం రగిల్చి అశాంతిని రేగకొట్టా డనే నేరంక్రింద విదేశీయుల అడుగులకు మడుగులొత్తే దేశీయ పోలీసులు ఖైదులో పడేశారు.

♦ ♦ ♦

జ్ఞాన్ ఖైదునుండి బయట పడగానే అతని హృదయంలో విదేశీయులయెడ విద్రోహజ్వాలలు ప్రజ్వరిల్లాయి. వాళ్లు భేదో పాయంచే మనలో పరస్పరముగా పోట్లాటలుపెట్టి ధనంగడించు తున్నారనే భావాలు జనించాయి. అందువలన మొట్టమొదట వారి నెదుర్కోవాలి. స్వాతంత్ర్యం పొందాలనే వుద్దేశ్యం పొడ సూపింది అతనిలో. అందుకు విప్లవం తీసుకురావటానికి సర్వ సన్నాహాలు చేయసాగాడు. అదికూడా రహస్యంగా.

ఒక రోజున ఒక విదేశీయుడు మలిన వస్త్రములను ధరించినవాడు అతని దగ్గరకొచ్చాడు. ముఖం ముడతలు అతని వృద్ధాప్యాన్ని సూచిస్తున్నాయి. కళ్లు లోతుకుపోయి అతనికి తిండి లేదని చాటుతున్నాయి. వాడు జ్ఞాన్‌తో—"నేను విదే శీయుడను. ఆకలితో అటుమటిస్తున్నాను. కాన తమ కేదైనా పని చూపిస్తే నా పొట్టపోసుకుంటాను. నన్ను మీరు పరీక్షించు

కోవచ్చు" అని చెప్పాడు దైన్యంతో. జ్ఞాన్ తన అశక్తతకు జాలిపడి దుఃఖంతో—"నేనుకూడా నీ వంటివాడనే" అన్నాడు.

విదేశీయుని హృదయం కరిగింది—"నేను మీ హృదయాన్ని చూచి దుఃఖిస్తున్నాను. నన్ను సోదరునిగా భావించండి. మనలో సానుభూతుంటే, సోదరత్వంవుంటే, యీ ఆకలి ఒక చిన్న విషయం. భగవంతుడు మీ కాశయసిద్ధి కలుగచేయుగాక! నేను మీ కేమైనా సహాయంచేయగలనా?' అని అడిగాడు. అతని హృదయంలో ఆనందకిరణాలు విరజిమ్మాయి.

జ్ఞాన్ పొట్టనిండా తిండివున్నప్పుడే దేశీయ విదేశీయ భావాలు స్ఫురిస్తాయని తెలుసుకొన్నాడు. "అన్నిటికంటె ఘోరశత్రువు ఆకలే! ముందు దానిని జయించాలి. తరువాతనే యేదైనా!" అని అనుకున్నాడు.

అతడు ఆకలిగొనియున్న బీదల నందరిని సంఘంగా యేర్పరచాలనే ఉద్దేశ్యంతో పని ఆరంభించాడు. ధనవంతుల దగ్గర యినుపపెట్టెలలో బూజుపట్టే కాగితాలను, కొట్టులలో పురుగుపట్టే ధాన్యరాసులను తెచ్చి బీదలకు పంచిపెట్టటమే అతని వుద్దేశ్యం!

ఈ సంగతి ధనవంతులకు తెలియగానే అతనిని పట్టించారు. నానా హింసలు పెట్టించారు. కొండగుహలో తోయించారు. ఒకరొట్టె—అదికూడా పుచ్చుపట్టిన మొక్క జొన్నలదే!— ఒక చెంబునీరు—ఇది అతని ఆహారం.

జ్ఞాన్ దుఃఖం పెరిగింది. జీవితం భారంగా తోచింది.

"నేను జ్ఞానిని—భగవంతుని దూతనైకూడా పొట్టనిండా కూడు లేక చస్తున్నానే! యిక మిగిలిన వారిగతి యేమిటి? ఛీ ఈ జీవితం వృథాభార"మని తలచాడు.

ఒక రోజున కొండెక్కాడు. అక్కడనుండి దూకి భగవంతుని దగ్గరకేగి—"ఓ భగవంతుడా! నన్ను రక్షించు. నాకీ ప్రపంచంలో స్థానంలేదు. నేనీ బాధలను సహించలేను" అని ప్రార్థించుదామనే అతని నిశ్చయం. చుట్టూవున్న కందకంలోని నీటిని చూచి ఆలోచించసాగాడు. తదేకదృష్టితో నీటివైపు చూస్తూనే యున్నాడు అతడు. దూకుదామనుకుంటూండగానే అతనికి తన ఛాయ కన్పించింది. అది—"నీవు నీతో పోట్లాడు, తరువాత యితరులతో" అని వుపదేశించినట్టయింది అతనికి. జ్ఞాని భయపడి ఆగిపోయాడు.



"ప్రేమ్‌చంద్"

# కఫన్

గుడిసె గుమ్మం దగ్గరలో తండ్రి కొడుకు—ఇద్దరు ఆరిపోయిన తంపట కెదురుగా కూర్చొని తినబోయే దుంపల రుచిని వూహించుకొంటున్నారు. లోపల కొడుకు భార్య బుధియా ప్రసవ వేదనతో గిలగిల తన్నుకుంటోంది. అప్పుడప్పుడు ఆమె నిట్టూర్పు విన్నప్పుడు యిద్దరూకూడా గుండె బాదుకొని వుండిపోతారు. శీతాకాలం. ప్రకృతి నిస్తబ్ధంగావుంది. గ్రామం అంధకారంలో లీనమయిపోయింది.

ఘీసూ: —"బహుశా! బ్రతకదనుకుంటారా! ఏం చేస్తోందో పోయి చూచిరా!" అన్నాడు.

మాధవుడు మండిపడుతూ—"చావాలనేవుంటే త్వరగా ఎందుకుచావదూ అంటాను" అన్నాడు.

ఘీసూ:—"నీవు చాలా నిర్దయుడవురా, బే! సంవత్సరమంతా ఆనందంతో గడిపినదానితో యింత పగేరా?"

మాధవుడు:"బాబు! నేనుమాత్రంచూడలేనుదానిబాధ."

మాదిగ కుటుంబం. గ్రామమంతా చెడ్డపేరు. ఘీసూ ఒకరోజున పనిచేస్తే మూడు రోజులు పండుకొంటాడు. మాధవుడు పనిదొంగ. పట్టుమని పదినిమిషాలన్నా పనిచేయడు. అందువలన వారిని ఎవరూకూడా పనిపాటల్లోకి పిల్చేవారు కాదు. అసలు వాళ్ళు యింట్లో ఏమాత్రం జరిగే అవకాశమున్నా జారవిడువని ఘటికులు. రెండుమూడు వుపవాసా

లయిన తరువాతనే ఏదన్నా పని వెతుక్కునేవారు. షీసూ చెట్లమ్మటి తిరిగి నాలుగు మొండుపుల్లలు ప్రోగుచేసుకొస్తే ఘూఢవుడు వాటిని అమ్ముకొచ్చేవాడు. ఆ డబ్బు లున్నంతవరకు వారు రాజాధిరాజులు. ఇంకొకరికి దాసోహంచేయటం ఏమాత్రం యిష్టంవుండదు. మరల రెండుమూడు పుసవాసా లయిన తరువాత పుల్లలకు పోవటమో. కూలికిపోవటమో జరుగుతూవుండేది. అది గ్రామం—వ్యవసాయం ప్రధాన వృత్తిగా గల గ్రామం. చేసుకునేవాడికి చేసుకున్నంత పని. కాని హీరికిమాత్రం పని దొరకదు. దొరికినా; చేయనూ చెయ్యరు. ఎప్పుడైనా యెవ్వరైనా పిల్వటం తటస్థపడితే అది సృష్టి వైపరీత్యమే! అప్పుడుకూడా యిద్దరు చేసేపని ఒక్కడీ పనిక్రింద జమకట్టుకునే పిల్వటం జరుగుతుంది. వారే సాధువు లైనట్లైతే వారికి తృప్తికి సంతోషానికి వేరే సంయమనియమాలు అవసరం వుండేవికావు. ఇది వారి ప్రకృతి! ఇది వారి విచిత్ర జీవితం! ఇంటిలో రెండు మట్టిపాత్రలు మినహా మరే సంపత్తి లేదు. గుడ్డపీలికలతోనే తమ నగ్నత్వాన్ని దాస్తూవుంటారు. ఈతిబాధలు తక్కువ, అప్పుల బాధలు యెక్కువ. తిట్లుతిన్నా, దెబ్బలుతిన్నా ఆ మరుక్షణంలోనే మరచేపోగల సమర్థులు. ఏమీ రాదనుకున్నా అడిగినప్పుడు కొద్దోగొప్పో ప్రతివాడు సర్దుతాడు.

దుంపలు వచ్చినకాలంలో చుట్టుపక్కలున్న చేలలో నుండి దొంగతనంగా యెత్తుకొచ్చి తంపవేసుకొని తింటారు.

చెరుకుల కాలంలో రెండుమూడు గెడలు విరుచుకురావటమూ, తింటూ పడివుండటమూ జరుగుతూంటుంది. ఘీసూ యీ వృత్తిలోనే అరవై సంవత్సరాలు గడిపాడు. మరి మాధవుడు కూడా సుపుత్రునిలా తండ్రి అడుగుజాడల్లోనే నడుస్తున్నాడు. తండ్రికంటె రెండు-మూడు అడుగులు ముందుకు వేస్తున్నాడు కూడాను. ఇప్పుడుకూడా యితరుల చేలనుండి దొంగిలించు కొచ్చిన దుంపలు తంపటి కెదురుగా కూర్చొని వాటి రుచిని గ్రాహించుకుంటున్నారు. ఘీసూ భార్యపోయి చాలకాల మయింది. మాధవుని వివాహం క్రిందటి సంవత్సరమయింది. ఈమె వచ్చిన తరువాత ఆ యింటిలో వ్యవస్థంటూ ఒకటి యేర్పడింది. వడ్లు దంచో, కోతకోసో ఈమె ఒక శేరు నూకలు సంపాదిస్తూవుండేది. వాటితో ఆ గర్భదరిద్రుల పొట్ట నింపుతూ వుండేది. ఈమె వచ్చినతరువాత మరింత యెక్కువయింది వారి సోమరితనం. ఎవరన్నా కూలికి పిలిస్తే మొహమాటం లేకుండా రెట్టింపు కూలి అడుగుతూవుండేవారు. ఈమె నేడు ప్రసవ వేదనతో గిలగిల తన్నుకుంటుంటే వారు 'యెప్పుడు చస్తుందా, యెప్పుడు చూద్దామా!' అని అనుకొంటున్నారు.

ఘీసూ దుంపల పెచ్చుతీస్తూ—"పాపం! దానికి యెట్లావుందో చూచిరా!" అన్నాడు. మాధవుడికి-లోపలకు పోతే పీడేం కుంభకోణం చేస్తాడో అని భయం. అందువలన వాడు — "అక్కడకు వెళ్తేవుంటే నాకు భయమేస్తోంది" అన్నాడు.

"నేను యిక్కడ వుండగా భయమెందుకు ?"

"అయితే నీవు పోయి చూచిరా ?"

"నా భార్య చచ్చిపోయినప్పుడు దాని దగ్గరనుండి మూడు రోజులవరకు కాలు కదలపలేదు. అదికాకుండా నన్ను చూసి సిగ్గుకుండా పడుతుంది. నేనుపోయి యెట్లా చూచేది ? అవయవాలుకూడా దాని అధికారంలో వుండవు. నన్ను చూడగానే కాలు కదలపలేదు."

"నేను యెవ్వడన్నా పుట్టితే యెట్లాగబ్బ అని ఆలోచిస్తున్నాను. అల్లంలేదు. బెల్లంలేదు. యేం చేయాలి ?"

"అవుసరంరాగానే అన్నీ వాటంతటకవే వస్తవి. భగవంతుడు చల్లగా చూడాలిగాని, యేదీ తక్కువవ్వదు. నాకు తొమ్మిదిమంది పుట్టారు. ఇంట్లో యేమీ వుండేదికాదు యెప్పుడూనూ. కాని భగవంతుడు చల్లగా చూచాడు. అందరూ గట్టెక్కిపోయారు. అదృష్టవంతులు."

రేయనక పగలనక కష్టపడువారి స్థితి వీరిస్థితికంటే మరీ ఘోరంగావుంది. అందువలన సమాజంలో యిటువంటి మనః ప్రవృత్తి గలవారు వుంటారంటే ఎందుకు వుండరు ? కష్టపడి వస్తుపడుకునేవారికంటే కష్టపడకుండా పడుకున్నవాడే తెలివి గలవాడు. అందువలన ఘీసూ కష్టపడువారికంటే మేధా సంపన్నుడని చెప్పుకోవాలి. కనుకనే వాడు కష్టజీవుల సమూహంలో చేరకుండా గప్పాలుకొట్టే గొప్పజీవుల సమావేశంలో పాల్గొన్నాడు. ఇంకా విచిత్ర మేమిటంటే వాడిలో వారి

నీతి నియమాలకు లొంగే వోపిక లేదు. అందువలన అందరూ వాడిని తూర్పారబట్టారు. కష్టపడి పనిచేయటం లేదుగదా! పస్తుపడుకుంటే మాత్ర మేం? వారి భోళాతనంవల్లగాని, వారి అమాయకత్వంవల్లగాని యెవ్వరూ యెట్టి లాభం పొందటం లేదుగదా?

ఇద్దరూ దుంపలు తీసుకొని గొంతుక కాల్చుకుంటూ తింటున్నారు. నిన్నటినుండి యేమీ తినలేదు. వాటిని చల్లారనిచ్చేవరకు వోపిక వుండొద్దూ! అనేక పర్యాయాలు గొంతుకలు కాలాయి. పైతోలు తీసేసిన తరువాత పైకి చూస్తే చల్లగానే వుంటుంది కాని లోపల పంటికింద పడిన తరువాత లోపలవేడి పైకి తంతుంది. ఇక మింగేయటంలోనే వుంది శ్రేయస్సు. అక్కడ చల్లగా చేసే సరుకులు చాలా వున్నాయి. అందువలన వారు త్వరత్వరగా మింగుతున్నారు. వారి కళ్ల వెంట కన్నీరుకూడా కారుతున్నాయి.

ఘీసూకి అప్పుడు యిరవై సంవత్సరాలపూర్వం జరిగిన ఠాకూర్ పెండ్లి గుర్తుకొచ్చింది. వాడు తృప్తిపడింది ఆనాడు. అందువలననే దానిని అప్పుడప్పుడు గుర్తుకు తెచ్చుకుంటూ వుంటాడు— "అబ్బ! విందంటే విందు అది. దానిని మాత్రం మరచిపోలేను. అప్పటినుండి నేటివరకు అటువంటిది యెక్కడా తగల్లేదు. పిల్లతరఫువాళ్లు అందరికీ తినిపించారు పూరీలు. అందరూ తృప్తిదీర తిన్నారు. అందరూ... నెయ్యికూడా కల్తీ లేంది. పప్పు, అరటికాయ వంకాయ, బెండకాయ, తీపి,

కారం...అబ్బ! పాకశేమిటి...అన్నీ! ఏం చెప్పమంటావు. ఏ లోటూ లేదు. తిన్నాడికి తిన్నంత. ఏదికావాలంటే అది. అబ్బ! ఏం తిన్నారు? నీళ్ళుకూడా త్రాగలేదు. ఇక వడ్డించే వారు వున్నారు అవ్వాయి చువ్వాలు! వద్దన్నా వడ్డించి పోతారు. కిళ్ళీలుకూడా యిచ్చారు. కాని నాకు అది గుర్తుకు రానేలేదు. నిలబడిపోయాను. పోయి ఒకమూల పండుకొన్నాను. అంత బాగా పెట్టాడు ఆ ఠాకూర్."

మాధవుడు వాటి రుచి వూహించుకుంటూ—"ఇప్పుడు మనకు యెవ్వడూ అటువంటి అవకాశం యివ్వడు" అన్నాడు.

"అరె! యిప్పుడు యెవ్వడు పెడతాడోయి. ఆ కాలమే వేరు, ఆ కథేవేరు. ఇప్పుడు యెవ్వడికీ ఖర్చుఅంటూ గిట్టదు. వివాహంలో ఖర్చుచేయను. ఆనందంలో ఖర్చుచేయరు. చివరకు కర్మల్లోకూడా ఖర్చుఅంటే అదిరిపడతారు. బీదవాళ్ల పొట్టలుకొట్టి గడించినదాన్ని యేంచేస్తారో అడుగవోయి? ప్రోగుచేయటం యేమాత్రం తక్కువగాలేదు. ఖర్చుమాత్రం తగ్గిపోయింది."

"నీవు యిరవైపూరీలు తిని వుంటావు."

"ఇరవైకంటె యెక్కువే తిన్నాను."

"నేనైతే యేభై తినేవాడిని."

"నేనూ యేభైకంటే తక్కువ తినివుండను. మంచి అదంలో వుండాను. నీవు నాలో సగంకూడా లేవు."

దుంపలు తిని యిద్దరూ నీరుత్రాగారు. అక్కడనే

తంపటకెదురుగానే తమ పైపంచి కప్పుకొని మూడంకెవేసి నిద్ర పోయారు.

ఇంకా బుధియా బాధపడుతూనే వుంది.

## 2

ఉదయం మాధవుడు గుడిసెలోకెళ్ళి చూచాడు. బుధియా శరీరం చల్లబడిపోయింది. ఆమెనోటిమీద యీగలు మూగాయి. తేలగుడ్లు వేసింది. దేహమంతా దుమ్ముతో నిండి పోయింది. ఆమెలోపలనే శిశువు చనిపోయివుంది.

మాధవుడు ఒక్కగంతులో ఘీసూదగ్గరకు వచ్చాడు. ఆ తరువాత యిద్దరూ బిగ్గరగా యేడ్వటం మొదలు పెట్టారు. రొమ్ములు బాదుకోసాగారు. ఇరుగువారు యీ యేడ్పు మొత్తుకోళ్లు విని పరుగెత్తుకొచ్చారు. తమతమ మర్యాదాల ప్రకారం నచ్చచెప్పారు.

కాని, యేడ్పు మొత్తుకోళ్లకు ఆటు టైంలేదు. కఫన్ కట్టెలుచూడాలి. గద్దగూటిలో మాంసం మాయమైవుండట్టే యిక్కడ డబ్బులు మాయమై యున్నాయి. చిల్లిగవ్వ కూడా లేదు.

తండ్రికొడుకులు యేడుస్తూ, మొత్తుకుంటూ గ్రామంలోని జమీందారుగారి దగ్గరకు వెళ్లారు. ఆయనకు వీళ్లంటే మంట. అనేక పర్యాయాలు వీళ్ళను తన చేతుల్తో కొట్టారు. తన్నారు. మాటప్రకారం నడుచుకోనందుకు; దొంగతనం చేసి

నందుకు—"ఏంటిరా యేడుస్తున్నారు? ఈ మధ్య యెక్కడా తగలటం లేదేం? ఈగ్రామంలో వుండాలనుకోటం లేదా యేం?"

తనకు కావాల్సిన వినయ విధేయతలను చూపిస్తూ, కన్నీరు కారుస్తూ ఘీసూ అన్నాడు—"సరకార్! ఆపదలో వున్నాను. మీ పాలేరు మాధవుడిభార్య రాత్రిపోయింది. రాత్రి అంతా గిలగిల కొట్టుకుంటూ నేవుంది. మేము దాని చుట్టూ కూర్చొని చెయ్యాల్సిన పనులన్నీ చేశాం. కాని ఫలితం లేకపోయింది. ఈ జీవితం చాలించుకుంది. ఇక యిప్పుడు మమ్ములను చూచే నాథుడే లేకపోయాడు. సరకార్! నాశన మయ్యాం. ఇల్లు కూలిపోయింది. నేను మీ దాసుడను, మీరు మినహా మాకు యింకెవ్వరున్నారు. మా దగ్గరున్న నాల్గు డబ్బులు మందులకే అయిపోయాయి. ఇక మీ దయలేందే దాని శవం మట్టిలోకల్వదు. సరకార్! మీరు దయచూపాలి."

జమీందారుగారు స్వతహా దయకలవారు. కాని ఘీసూ అంటే దయచూపటం నలుపుమీద తెలుపు యెక్కించటమే!—"పోరా! వెధవా! పనుండి పిలిస్తే యివతలి అడుగుతీసి అవతల పెట్టవు. నీకు అవసరం వచ్చిందని పొగుడుతున్నావా! పో! పోరా!" అందా మనుకున్నారు, కాని అనలేక పోయారు. లోలోపల కుళ్ళుతూనే రెండురూపాయిలు తీసి వాడి మొఖాన విసిరారు. ఒకమాటకూడ మాట్లాడలేదు. వాడివంక చూడనుకూడా చూడలేదు. తలబరువు తగ్గిందనుకున్నారు.

జమీందారుగారు రెండురూపాయి లిచ్చినప్పుడు యితర షావుకార్లు, కోమట్లు, కాదనలేకపోయారు. ఘీసూ జమీందారు గారి పేరుచెప్పుకొని బ్రతకటం నేర్చినవాడు. ఒక ఘడియలో వాళ్ళదగ్గర అయిదు రూపాయిలు, వడ్లు, పుల్లలు ప్రోగ య్యాయి. ఇక మధ్యాహ్నం ఘీసూ మాధవులిద్దరు కఫన్ తీసుకురావటానికి బజారు వెళ్ళారు. ఇక్కడ కొంతమంది పెద్దమనుష్యులు చితి కట్టుచున్నారు.

గ్రామంలోని మెతక మనస్సులు గలవారు వచ్చి శవాన్ని చూచి రెండు కన్నీటిబొట్లు రాల్చి పోతున్నారు.

# 3

బజారులో కెళ్ళిన తరువాత ఘీసూ—"కట్టెపుల్లలు సరిపడ దొరికినాయంటరా !" అని అడిగాడు మాధవుణ్ని.

మాధవుడు—"ఆ, కట్టెపుల్లలు సరిపడ దొరికినాయి. ఇక కఫన్ కావాలి" అన్నాడు.

"అయితేపద. తేలిక ఖరీదులో ఒక కఫన్ తీసుకుందాం."

"ఇంకెందుకు అది. శవాన్నెత్తేటప్పటికి చీకటిపడుతుంది. చీకట్లో కఫన్ యెవడు చూడొచ్చాడు ?

"ఎంత చెడ్డరివాజు! బ్రతికుండగా బలుసాకుకే గతిలేని దానికి చచ్చిపోయిన తరువాత క్రొత్త కఫన్ కావాలి?"

"చివరకు కఫన్ కూడా శవంతో పాటుకాలిపోవాల్సిందే!"

"అవును,యింకెందుకు? ఈ అయిదురూపాయిలే ముందు

దొరికి నట్టయితే-మందు యిప్పించేవని. బ్రతికేదేమో!"

ఇద్దరూ ఒకర్నొకర్ని అర్థం చేసుకున్నారు. బజారులో అటూ ఇటూ కాసేపుతిరిగారు. అనేక కొట్టులు చూచారు. అనేక గుడ్డలు చూచారు. కాని యేమీ నచ్చలేదు. సాయంత్రం వరకు చూస్తూనేయున్నారు. అప్పుడు యిద్దరూ యే అలౌకిక ప్రేరణ వల్లనోగాని మధుశాలదగ్గరకు చేసుకున్నారు. యథా ప్రకారంగానే జరిగినట్టు లోనికివెళ్ళారు. అక్కడ యిద్దరు కొద్ది క్షణాలపాటు సందేహంలో పడ్డారు. ఆ తరువాత ఘీసూ షాహుకారు దగ్గరకువెళ్ళి—"సాహుజీ! ఒకబుడ్డి మాకుకూడ యియ్యవయ్యా!" అన్నాడు.

ఆ తరువాత నంజుకూడా వచ్చింది. వేయించిన చేపలు వచ్చాయి. ఇద్దరూ వరండాలో కూర్చొని మజాగా త్రాగారు ఆవేశపూరితులయారు. ఇద్దరూ వరండాలో కూర్చొని శాంతంగా త్రాగారు. ఆవేశపూరితు లయ్యారు.

ఘీసూ—"కఫన్ వేసుకున్నందువల్ల యేం వస్తుంది చివరకు మట్టిపాలయ్యేదేగా!" అన్నాడు ఆనందంలో మునిగి తేలుతూ.

మాధవుడు ఆకాశంవైపు నక్షత్రాలను తన సాక్ష్యులుగ చేసుకొన్నట్టు—చూస్తూ—"ప్రపంచంపోకడే అంత. రెక్కలు ఆడితేనేగాని డొక్కలాడని అనేకమంది యీ బాపనోళ్ళకు యెందుకు యిస్తారంటావు? పరలోకంలో దొరుకుతుందో లేదో యెవ్వడు చూస్తున్నాడు?" అన్నాడు.

"ధనవంతులదగ్గర డబ్బుంది. వూదుతున్నారు. మన దగ్గర వూదటానికి మాత్రం యేముంది?"

"కాని లోకులు అడిగితే యేంచెప్పతావోయి!"

"అరె! నీ తెలివి తెల్లార. యింతమాత్రం చెప్పలేకపోతే మనం బ్రతికి మాత్రం దేనికి? డబ్బులు బొడ్డునుండి జారి పోయాయి. ఎంత వెతికినా దొరకలేదు అంటే వాళ్లు నమ్మక పోయినా డబ్బులు మాత్రం తప్పకయిస్తారు."

"పాపం చాలామంచిది, చచ్చేటప్పుడుకూడా బాగాపెట్టి పోయింది."

ఇద్దరూ తమలో తామే పకపకా నవ్వుకొని పూరీలు తిన్నారు. జవాబుదారీ భయంలేదు. బదనామీ భయంలేదు. వీటిని యెప్పుడో జయించారు.

ఘీసూ దార్శనికునిలా—"మన ఆత్మలు సంతోషిస్తే దానికి పుణ్యం వుండదంటావా?" అని అడిగాడు.

మాధవుడు దానిని వొప్పుకున్నట్టుగా తలవొంచి— "తప్పక వుంటుంది. ఓ, భగవంతుడా! నీవు అంతర్యామివి. దానిని—బుధియాని, వైకుంఠానికి తీసుకుపో! మేము హృదయ పూర్వకంగా ఆశీర్వదిస్తున్నాం. నేటిలా తృప్తిదీర మరెన్నడూ తిని వుండము, తినలేముకూడాను" అన్నాడు.

ఒక్క క్షణం తరువాత మాధవుడికి ఒక సందేహం కల్గింది—"ఏరా, నాయనా! మనంకూడా ఒకనాడు అక్కడకు వెళ్లతాం కాదూ!"

ఘీసూ యీ అమాయిక ప్రశ్నకు జవాబు యివ్వలేదు. వాడు పరలోకాన్ని గురించి ఆలోచిస్తూ యీ ఆనందం అనుభవించటంలో ఆటంకం యేర్పరచ గోరటంలేదు.

'అది అక్కడ నాకు కఫన్ యెందుకు తేలేదంటే యేంచెప్పుతావోయి!"

"నీకు తోడు కఫన్ కూడానా?" అని అంటాను.

"దానికి కఫన్ రాదని నీవు యెందుకు అనుకోవాలి. నీవు నన్ను అంత యధవక్రింద జమకట్టేసావేం? అరవై సంవత్సరాల అనుభవాన్ని మట్టిలో కలిపేసినట్టున్నావు. దానికి కఫన్ తప్పక దొరుకుతుంది. ఇంతకంటే మంచి కఫనే దొరుకుతుంది."

మాధవుడికి నమ్మకం కలుగలేదు— "ఇంకా యెవరిస్తారంటావు? యిచ్చిన వాటిని మింగేశాం! అది నన్నే అడుగుతుంది. దానికి తాలుబొట్టు కట్టింది నేను. బాధ్యత నామీద వుంది."

ఘీసూ వుగ్రుడయ్యాడు— "నేను చెబుతున్నాను; దానికి కఫన్ దొరుకుతుందని. నీ వెందు కొప్పుకోవు?"

"ఎవరు యిస్తారో యెందుకు చెప్పవు?"

"ఇచ్చినవాళ్ళే యిస్తారు. కాని ఆ రూపాయిలు మన చేతిలోకి మాత్రంరావు."

చీకటి పడుతోంది. నక్షత్రాల కాంతి పెరుగుతోంది. మధుశాలలో హడావిడికూడా పెరుగుతోంది. ఒకడు పాడు

తుంటే మరొకడు నాట్యమాడుతున్నాడు. ఒకడు అరుస్తుంటే మరొకడు కౌగిలించుకొంటున్నాడు.

అచ్చటి వాతావరణంలో వుత్సాహం, వాయువులో వున్మాదం వున్నాయి. ఇవి రెండుకలసి బాధాగ్రస్తులను అలౌకిక ఆనందంలోకి తీసుకొని వెళ్ళతాయి.

ఈ తండ్రికొడుకులు యిప్పుడు బలే మజాగా త్రాగుతున్నారు. అందరి దృష్టి వీరిమీదనే. నిండుసీసా యెదుట వుంది. అదృష్టవంతులు.

తృప్తిదీర తిని మాధవుడు మిగిలిన పూరీలను తమవైపు ఆశానేత్రాలతో చూస్తున్న భిక్షుకుడికి యిచ్చాడు. ఇచ్చే గౌరవం, ఆనందం, వుల్లాసం నేడు అనుభవించాడు మాధవుడు గత జీవితంలో.

ఘీసూ:—"తీసుకుపోరా! తృప్తిదీర తిని ఆశీర్వదించు. సంపాదించి చచ్చిపోయింది. హృదయపూర్వకంగా ఆశీర్వదించు. చాలా కష్టపడి సంపాదించిన డబ్బులవి" అన్నాడు.

మాధవుడు నక్షత్రాలవంక చూస్తూ—"అయ్యా! అది వైకుంఠానికి వెళుతుంది. తప్పక వెళ్తుతుంది. వైకుంఠరాణవుతుంది" అన్నాడు.

ఘీసూ నిలబడ్డాడు. ఆనంద కెరటాలలో వూగుళ్ళాడుతున్నవానిలా అన్నాడు.—"అవునురా! వైకుంఠానికి వెళ్తుంది. ఎవ్వరినీ బాధ పెట్టలేదు. ఎవ్వరినీ అణచలేదు. చస్తూ చస్తూ మన కోర్కెను తీర్చి వెళ్ళింది. అది వెళ్ళక యీలాంటి

వాళ్ళు—రెండుచేతుల్తో దోపిడీచేసి, తమ పాపపరిహారార్థం గంగలో మునిగే యీ లావాటివాళ్ళు వెళ్తారంటావా ! ”

శ్రద్ధాభావం వెంటనే మారిపోయింది. చంచలత పున్నాదం విశిష్టత; దుఃఖం, నిరాశ వెన్నాడాయి...

మాధవుడు —“ కాని అయ్యా ! అది జీవితంలో చాలా కష్టాలు అనుభవించింది, ఎల్లకాలం కష్టాలతోనే కాపురం చేసింది. కష్టాలతోనే గట్టెక్కింది” అంటూ ఒక నిట్టూర్పు విడిచాడు.

వాడు కండ్లమీద చెయ్యి వేసుకొని యేడ్చాడు. యెక్కి యెక్కి యేడ్చాడు.

ఘీసూ నచ్చచెప్పాడు—“ ఎందుకురా యేడుస్తావు ? కష్టాలనుండి గట్టెక్కిందని సంతోషించక యేడుస్తా వెందుకురా! మంచి అదృష్టజాతకురాలు.”

ఇద్దరూ నిలబడి పాడారు—

‘ పాడరా ! ఆడరా !
ఆడుతూ పాడరా !
మృదు మధుర
జీవితమురా
అనుభవించగ
రా ! రా ! జీవుడా !
ఆడుతూ పాడరా !......”

ఇతర త్రాగుబోతుల దృష్టి వారిమీాదనే వుంది. వారు ఆనందంలో నిమగ్నులై పాడారు; ఆడారు; పడ్డారు; లేచారు. భావం చెప్పారు. అభినయం చేశారు. చివరకు మత్తెక్కినవారై క్రింద కూలారు.



భగవతీచరణ వర్మ

# అర్థపిశాచం

నేనారోజున నిజంగా భయపడ్డాను. వణకిపోయాను. నేను పిరికిపందను కాను. కాని వణికిపోయాను. డాక్టర్ను అయివుండీ, రోజూ అనేక చావులు చూస్తూండీ, ఆరోజున యెందుకనో భయపడ్డాను; వణకిపోయాను.

అంధకారబంధురమైన ఆగదిలో నేను ఆ వృద్ధుణ్ని చూశాను. అతని తల మీాదనే ఏదో సంచరిస్తోంది. అదేంటో నాకు తెలియదు. నాకు నరకమంటే నమ్మకంలేదు, స్వర్గమంటేనూ నమ్మకంలేదు. కాని ఆరోజున నాకు నరకంలో పడ్డట్టేవుంది. ఉందేమిటి; నిజంగా నరకంలోనే పడ్డాను.

గదిలో ప్రవేశించటంతోటే నాకు ఓ క్షీణస్వరం— "డాక్టరు గారూ!" అని వినపడింది. ధ్వని వినవచ్చినవైపుకి తిరిగి చూశాను—ఒక మంచంమీాద ఆ వృద్ధుడు కూర్చొని వున్నాడు. మృత్యుశయ్యపై కూర్చున్న అతని ముఖంలో కళాకాంతులు లేవు; నే నతనివైపుకి ఒక అడుగు వేశాను. ఒక అడుగు వెయ్యటంతోటే నా శరీరంలో వణకు పుట్టిపోయింది.

ఆ వృద్ధుడు వంటరిగా లేడు. అతనితోపాటు యింకేదో వుంది. నే నా వృద్ధుణ్ణి చూశాను. ఆ వృద్ధుని వెన్నంటివున్న ఛాయను చూశాను నన్ను చూడగానే ఆ ఛాయ నవ్వింది. దాని చూపుల్లోని అగ్ని నా హృదయంలో చొచ్చుకుపోయి

ప్రజ్వరిల్లింది. నేను భయపడ్డాను. వణికిపోయాను.

ఆ వృద్ధుడు— "డాక్టరుగ రూ!" అని మరల క్షీణ స్వరంలో పిలిచాడు. అతని శిరస్సుమీద సంచరిస్తున్న ఛాయ మాయమైపోయింది. నేను — "అమ్మ బాబు! బ్రతికానురా దేముడా!" అనుకున్నాను. అతని దగ్గరకు వెళ్ళాను. అతని శరీరంలో రక్తంలేదు. పాండురోగిలా వున్నాడు. కళ్ళు లోతుకు పీక్కుపోయాయి. — "డాక్టరుగారూ!" అని మరల పిలిచాడు.

నేను కుర్చీమీద కూర్చుంటూ — "చెప్పండి! మీకుండే బాధలు!" అన్నాను. నాగుండెదడ యింకా పోనేలేదు.

"డాక్టరుగారూ! నన్ను రక్షించండి!" అతడు క్షీణించిన స్వరంలో అన్నాడు. నేను వృద్ధుని మాటకు సమాధానం యివ్వలేదు. నే నాగదిని బాగా పరిశీలించి కలియ చూశాను. విశాలమైన ఆ గదిలో ఆ వృద్ధుని మంచం వుంది. వెండితో తయారైన ఆ మంచం కోళ్ళమీద బంగారంతో నగిషీ చేయబడింది. అతిగంభీరంగా నిర్మలంగా వున్న ఆ గదిలో ఎండలు మెండుగా కాచే జ్యేష్ఠమాసంలోకూడా సూర్యరశ్మి సోకదు. రెయ్యింబగ లనక ఒక లైటు నిర్విరామంగా వెలుగుతోంది.

కొంచెం సేపాగిన తరువాత, వృద్ధుడు "డాక్టరుగారూ!" అని మరల పిలిచాడు.

నే నతనివైపుకి చూస్తూ ఊఁ ఏమిటో చెప్పండి" అన్నాను.

"మీరు నన్ను రక్షించగలరా?" అత డడిగాడు. ఆలోచనలో మునిగున్న నేను మౌనంగా వుండిపోయాను.

నా జవాబుకి ఎదురు చూచిచూచి చివరకు విసుగు చెందిన తరువాత "మీరు నన్ను రక్షించలేరు!— రక్షించలేరు! ముమ్మాటికీ రక్షించలేరు. నన్ను నేను రక్షించుకోలేనప్పుడు మీరు నన్నేవిధంగా రక్షించ గలుగుతారు?" అంటూండగానే ఆయన కళ్లు మూసుకు పోయాయి. నాసహాయంతో పండుకో గలిగాడు ఆవృద్ధుడు.

వృద్ధుడు పండుకున్న కొద్ది క్షణాలకు కండ్లు తెరిచాడు. అతడు నావంక తదేకధ్యానంతో చూస్తున్నాడు. లోతుకు పోయిన అతని కళ్లు నాకేదో చెప్పటానికి ప్రయత్నిస్తున్నాయి.

ఆ గదిలో నిస్తబ్ధత తాండవిస్తూంది. నాగుండెల్లో రైళ్లు పరుగెత్తుతున్నాయి. మౌనం నాకు మహాభయంకరంగా వుంది. "ఎట్లావుందండి, మీకు?" అని అడిగాను.

వృద్ధుడు చిరునవ్వునవ్వుతూ "డాక్టరుగారు! మృత్యుదేవతతో యుద్ధంచేస్తున్నాను, జయించగలనా? అనుమానంగా వుంది. డాక్టరుగారు!..." అంటూ ఆగిపోయాడు.

మరల కొద్దిక్షణాలపాటు మౌనం! మరల అకస్మాత్తుగా "డాక్టరుగారు. నే నెవరినో, మీకు తెలుసా?" అతని స్వరంలో దృఢత్వం, కర్కశత్వం స్పష్టంగా కనిపిస్తున్నవి. "డాక్టరుగారు! భయపడవద్దు, నాశక్తి క్షీణించింది., నాకంటే ఏదో ప్రబలమైనశక్తి నాతో పోరాడుతోంది! పోరాడటం ఏమిటి, జయం

కూడా-పొందుతున్నది. నేను ఓడిపోతున్నాను, నేను ఎవరినో మీకు తెలియదు. ఇంతకుముందు నాకుకూడా తెలియదు. కాని యిప్పుడు తెలిసినా మీకు నేను అపకారం చేస్తాననికూడ మీరు గాభరాపడవద్దు. నేను అపకారంచేయను. నేను ప్రేతాన్ని, భూతాన్ని. ఇదే నా జీవితనగ్నసత్యం. నేను ప్రేతాన్ని, ప్రేతాన్ని!"

ఆ కురూపిఛాయ వృద్ధుని శిరస్సు మీదనే మరల తిరుగుతూ నవ్వుతూ వుండటం నేను చూశాను.

ఆ గదిలో నాకు వూపిరి సల్పటంలేదు. పారిపోయి ప్రాణాలను కాపాడుకోందా మనిపించింది. లేవటానికికూడా ప్రయత్నించాను. కాని లేవలేకపోయాను. ఒక నిర్జీవప్రాణిలా కూర్చుని నేను వింటున్నాను. ఆయన చెప్పుకుంటూ పోతున్నాడు.—"డాక్టరుగారు! నేను నిజంగా సైతాన్ని. భయంకరమైన సైతాన్ని. అంతేగాదు—నేను కోటీశ్వరుణ్ణికూడా. నాదగ్గర డబ్బుంది. డబ్బుందిగాబట్టి అంతావుంది! దీని బలంతోనే మానవత్వాని కాలదన్నాను ఏది చేసినా సమర్థించుకో గలుగుతున్నాను. డాక్టరుగారు! నన్ను రక్షించండి! నాకు ఆయువును పోయండి! మిమ్ములను బంగారంతో తూస్తాను. ఆకాశంమీద యెక్కించగలను. నన్ను రక్షించండి!" వృద్ధుడు ఆవేశపూరితు డయ్యాడు- "డాక్టరుగారు! నన్ను రక్షించండి! నా దగ్గరనున్న వైభవాన్ని, ఆనందాన్ని అనుభవించటానికిగాను నన్ను రక్షించండి! నా ఆస్తిలో మీకుకూడా ఒక వాటా

యిస్తాను! మనమిద్దరం కలసి పంచుకుందాం...నా ఆ స్థిలోని సగ భాగంకూడా నన్ను రక్షించలేదా? వృద్ధుడు లేచి కూర్చు న్నాడు—"నీవు మళ్ళా యెందుకు వచ్చావురా? అసలు ఎందుకు ఇంకా బ్రతికున్నావు? పో! అవతలకి పో వెధవ! అని వృద్ధు డంటూవుండగానే నేను వెనక్కితిరిగి చూశా.—ఒక బక్క చిక్కిన నిరుపేద నా వెనుకనే నిలబడి యున్నాడు. ఆ వృద్ధుడు కట్టుబట్టలులేని ఆ నిర్భాగ్యుణ్ణి ఏం చేశాడో! అత టితో ఆ వృద్ధు డింకా ఆగలేదు—"నీవు కోరేది నీ డబ్బునే! నా డబ్బును కాదు. కాని దేనైనా నే నెందుకు ఇవ్వా లంటాను? నీవు నాకు డబ్బు యివ్వాలని అందరూ ఒప్పు కున్నారు. అసలు అందరూ ఒప్పుకుంటే నాకేం? ఒప్పుకోక పోతే నాకేం? కోర్టు ఒప్పుకుంది. అదిచాలు నాకు. కోర్టుకు కళ్లు లేవంటావా? అసలు నీ కున్నాయా అని నేను అడుగు తున్నాను. నీకు వుంటే ఎందుకు మోసపోయావు! అది నీ తెలివి తక్కువ. అందుకు పశ్చాత్తాప పడు! లేదా న్యాయం కావా లంటావా, మళ్లీ కోర్టుకెక్కు! దయ కావాలంటే భగ వంతుణ్ణి తలచుకో! ఆ తరువాత నేను చూచుకుంటాను. అందాక ఎందుకు? నీవు అది చేయాలనుకుంటే నా పని నేను యిప్పుడే చేసుకుంటాను. అసలు నీకు యీ ప్రపంచంలో జీవించ టానికే అధికారం లేనప్పుడు నీవు యివన్నీ ఎక్కడ యేడు స్తావులే! నీవు ఆత్మహత్య చేసుకో! నీ భార్య బిడ్డలు బ్రతుక లేరంటావా? అదిగో యిప్పుడే తేలిపోయింది. తెలివితక్కువ

దద్దమ్మవని. నీవు పోతేనే వాళ్ళను నావంటివాడెవడైనా చూసేది? వాళ్ళను చూచి కనికరించేది!" ఆ వ్యక్తి నవ్వాడు. బాధతో కూడుకున్న నవ్వు! గంభీరంగా వున్న ఆ వ్యక్తి ఆ నవ్వు విన్న నేను భయపడ్డాను. వణకిపోయాను.

వృద్ధుడిమాటలు విని ఆ వ్యక్తి వెనక్కు తిరిగాడు. ఆ అంధకారంలో లీనమైపోయాడు.

వృద్ధుడు ఆగి ఒక నిట్టూర్పు విడిచాడు—"పోయాడు. మంచిపనిచేసాడు, పోయాడు. డబ్బువుంటే కొండమీద కోతి దిగివస్తుంది! న్యాయం నోరు కట్టేయవచ్చు! భగవంతుడి కాళ్ళు చేతులు కట్టేయవచ్చు! డాక్టరుగారు! అందుకే నన్ను రక్షించండి! నాకోసం నన్ను రక్షించండి!" అంటూ ఆగి పోయాడు – ఆ వృద్ధుడు.

నేను వెనక్కు తిరిగి చూశాను. ఒకస్త్రీ, స్త్రీతోపాటు ముగ్గురు నల్గురు పిల్లలు నిలబడియున్నారు. ఆమెలో నిస్తేజమైన యౌవనం వుంది. సహజమైన సౌందర్యంవుంది. ఆమెను చూచి వృద్ధుడు అరచాడు–"రాక్షసీ! అవతలకిపో! నేనేం చేయలేను! చేతనైతే అడుక్కుతిను. లేదా నీలో యౌవనం వుంది. సౌందర్యం యింకా పోలేదు. వీటిని వుపయోగించుకో! ఆకలి తీరుతుంది. బాధ పోతుంది. చూస్తావేం నావంక! నాదగ్గర ఏంసత్తువలేదు. నేనేం చేయలేను. పో!" అన్నాడు.

స్త్రీ పిల్లలతోపాటు వెనక్కు తిరిగింది. యథాప్రకారంగా ఆ అంధకారంలో లీనమైపోయింది.

నేను భయపడ్డాను. పారిపోదామని లేచి వెనక్కి తిరిగాను. వెనక్కితిరిగి చూస్తినిగదా—పది పదిహేనుమంది యువకులువచ్చి నిలబడియున్నారు. వాళ్ళనుచూచి నేనుఆగిపోయాను. వాళ్ళ చూపులను చూస్తే నాకే భయంకల్గింది, వణకుపుట్టింది. వృద్ధుడు గర్జించుతూ – "మీరు సమ్మె చేయబోతున్నారు! చేయండి! నేను వద్దనను. అందువల్ల నాకొచ్చే నష్టం ఏంలేదు. కాని, మీ భార్యాపిల్లలతో పాటు మీరుకూడా ఆకలిబాధకు గురవుతారు! ఆకలిబాధతో అటమటించి చస్తామంటారా? పొండి! చావండి! నాకు ఏమీ అభ్యంతరంలేదు. ఓరి పశువుల్లారా! దున్నపోతుల్లావుండి పని పాటలు చేయకుండా పొట్ట పోసుకుందామనే, మీ వుద్దేశ్యం! సరే! చావండి!" అంటూండగా అందరూ వెనక్కి తిరిగారు. యథాప్రకారంగా ఆ అంధకారంలో లీనమైపోయారు.

నేను భయపడ్డాను. వణకిపోయాను. కుర్చీమీద చతికిలబడ్డాను. వృద్ధుడు నా చెయ్యి పట్టుకొని – "డాక్టరుగారు! నేను మీకెంతో కృతజ్ఞుడను. నాకు సాయం చేయండి. ఫలితం పొందండి! నన్ను బ్రతికించండి. నేను చావకోరటంలేదు. ఈ డబ్బుకోసం చావకోరటంలేదు. ఈ డబ్బుకి ఎందర్నిచంపానో, ఎందరిని హింసించానో! నా దగ్గర డబ్బుంది. దానితో మానవత్వాన్ని కొనగలశక్తి నా దగ్గర వుందని పూర్తిగా నమ్మకం వుంది. డాక్టరుగారు! నేను చావుతో పోరాడుతున్నాను. జయం పొందగలనా?" అని అడిగాడు.

నేను నెమ్మదిగా–'అసంభవ'మన్నాను.

"అసంభవమా!" వృద్ధుడు మండిపడుతున్నాడు. "అసంభవ మంటున్నావా? నీవు తెలివితక్కువదద్దమ్మవు;" అతడు మంచంమీదనుండి లేచాడు—నా చెయ్యిపట్టుకొని—"పోదాం పద!" అంటూ, యిదివరకు మానవులు వెళ్ళినవైపుకే లాక్కెళ్లాడు. అతడు దర్వాజాదగ్గరలో గోడకున్న స్విచ్చినొక్కాడు. తలుపులు తెరుచుకున్నాయి. ఆ లోపల బంగారపు కడ్డీలు కుప్పలుకుప్పలుగా పడివున్నాయి–"డాక్టరుగారు! చూడండి. ఈ బంగారంకూడా నాకు సాయపడదంటూరా? ఇంకా కొన్నాళ్ళ వరకు జీవించుదామనే నా కోర్కె. నాకు యీ బంగారం సాయపడదా?" అని అడిగాడు.

వృద్ధుడు మంచంమీద పడుకున్నాడు. తలుపులు తెరుచుకునే వున్నాయి. అతడు కొద్ది క్షణాలపాటు ఆ బంగారం వైపుకే తదేకధ్యానంతో చూచాడు. ఆ తరువాత – "డాక్టరు గారు! మీకు మొక్కుతున్నాను. నన్ను రక్షించండి! నాకు జీవం పోయండి! మీరు కోరిన డబ్బుయిస్తాను. మీరు చేయ మన్నది చేస్తాను. నాకు కావాల్సింది, యింకా కొన్ని సంవత్స రాలవరకు బ్రతకటం" అన్నాడు.

అప్పుడు–ఆక్షణంలో మరల ఆ ఛాయ కన్పించింది. వుగ్రరూపందాల్చిన దానిని చూస్తూంటే నా శరీరం వణకి పోయింది. వృద్ధుడు–"డాక్టరుగారు! నేను ఓడిపోయాను" అంటూ క్రింద కూలాడు. అతని గుండె ఆగిపోయింది.

నేను భయపడి వణకిపోయాను.

భగవతీ ప్రసాద వాజపేయ

# లచ్చి

కాలేజినుండి వచ్చేటప్పుడు నేను సాధారణంగా నా బంగళాను చూచుకొని వస్తూవుండేవాడిని. ఆ రోజుల్లో యిది తయారవుతోంది. ఒక ఓవర్‌సీయర్‌గారు రోజూ-వుదయం సాయంత్రం దానిని చూడ్డానికి వస్తూవుండేవారు. ఆయన నా రెండో అన్నగారి క్లాసుమేటు. పొడుగాటి శరీరం. గౌరవర్ణం. కోల ముఖం. పొడుగాటిముక్కు—అందమైన ఆకారం. పని అంటే మంచి వుత్సాహం. గంభీరంగా వున్నప్పుడుకూడా నవ్వుతూ వున్నట్టు కనపడతారు.

పేరు బేనీమాధవ్. మరి వయస్సు? ... వయస్సు షుమారు నలభై ఐదు సంవత్సరా లుంటుంది. శిల్పకారులుగాని, కూలివాళ్లుగాని మొత్తం సుమారు పాతిక ముప్పై మంది పని చేస్తూవుంటారు. కూలీలలో కొంతమంది స్త్రీలుకూడా వున్నారు.

ఒక రోజున పైభాగం దిమ్మిస చేస్తున్నట్టున్నారు. దిమ్మిస చేసేవారిలో స్త్రీలసంఖ్య యెక్కువ. యెక్కువేముంది, ఒకరిద్దరు మినహా అందరూ వాళ్లే! ఆ యిద్దరుకూడా వారికి దూరంగా ఒకమూల పనిచేస్తున్నారు.

స్త్రీలు దిమ్మిసచేస్తూ పాటపాడుతున్నారు. వారిపాట వింటానికి అంత శ్రావ్యంగా లేకపోయినప్పటికి ఆ అనేకకంఠాల

మధ్య మృదుమధురమైన కంఠంకూడా ఒకటివుంది. అందు వల్ల నేను వారిదగ్గరకు వెళ్ళటానికి తహతహలాడాను. ఆమృదు మధురకంఠంతో సమ్మోహనరాగంలో పాడుతున్న ఆమె యెంత అందకత్తె వుంటుంది? అది నా దుర్బలతయని నేను వొప్పు కుంటాను. కాని ఆరోజుల్లో యీ భావం నా కెట్లాతట్టుతుంది?

నేను వెళ్లటంతోటే ఓవర్ సీయర్ గారు ప్రత్యక్ష మయ్యారు—"వచ్చావా తమ్ముడూ?"

నేను వారివంక చూస్తూ చిన్నినవ్వునవ్వి—"నేనుకూడా అట్లాగే అనుకుంటున్నాను" అన్నాను.

వారు కూడా నవ్వుతూ అన్నారు—"కాని వాస్తవంగా నీవు యిక్కడకు రాలేదు. ప్రపంచదృష్టిలో నీవుయిక్కడ వున్నావని, యింతమాత్రానికే నీవు పదహారణాలకు యిక్కడకు వచ్చావని, నేను అనుకోను. నేను అనుకుంటున్నానని నీవుకూడా అనుకోవద్దు. ఎక్కడైనా నీవు నిన్ను కోల్పోయివస్తే?"

వారు యిది చెబుతూ నాకు దగ్గరలోకి వచ్చేశారు— "నేను యింజనీరింగ్ కాలేజీలో చదువుతూ వుండేటప్పుడు నేను యెట్లా వుండేవాడి ననుకున్నావు? నిన్ను చూచినప్పుడల్లా నాకు ఆనాటి స్మృతులు జ్ఞప్తికి వస్తుంటాయి. ఏం చేస్తే నాకు యీ జీవితంలో శాంతి దొరుకుతుందా అని ఆలోచిస్తూ వుంటాను. చివరకు మానవుని కోర్కెలకు అంతులేదని, ప్రపంచంలో యెక్కడకు పోయినా శాంతి దొరకదని అనుకొని తృప్తి పడుతూ వుంటాను."

బేనీ బాబు మోముపై నిశ్చలమైన గంభీరత వుంది. దానిని మందహాసంలో మాయంచేద్దామని యెంతగా ప్రయత్నించినా ఫలితం దక్కటంలేదు. నేను నెమ్మదిగా—"మీలో తెలుసుకోవాల్సిన విషయాలు చాలావున్నాయి" అన్నాను.

ఒక వైపుకిపోతూ ఆయన అన్నారు—"ఇప్పటివరకూ మీరు యేమీ తెలుసుకోలేక పోయారు."

బేనీ బాబు యీజవాబు విన్నా, నా కుతూహలత యే మాత్రమూ చావలేదు. నేనుకూడా ఆయనను అనుసరించాను.

తిరుగుతూ పనిచూస్తూ ఒక మిస్త్రీ దగ్గరకు వెళ్లారు. అతడు అప్పుడు ఆర్చి (Arch) కట్టడానికి వెళుతున్నాడు. బేనీ బాబు అతనివంక చూస్తూ—"ఇటుచూడు మిస్త్రీ! ఆకులు పూలు తయారు చేయటంలోనే సరిపెట్టకూడదు సుమా! ఈ నెలు ముల్లులుకూడా చూపించాలి. నకలు నకలే! మూలం అదెప్పుడూ కాజాలదు, అనుకున్నీ మూలంలోవున్న వాస్తవాన్ని గుణాన్ని, స్పష్టంగా చూపెట్టకపోతే అది నకలు అనిపించుకోదు కూడాను. అట్లా చూపెట్టడంలో నీకేదైనా కష్టంవుంటే చెప్పు! నమూనా యిచ్చిపోతాను. కాని నేను కోరుతున్నట్టు తయారు చేయకపోతే ముందు ఎటువంటి ఫలితం అనుభవించాల్సి వస్తుందో నేను చెప్పలేను" అన్నారు.

మిస్త్రీ ముసిలాడు. అతని వెంట్రుకలు మెరసిపోయాయి. అతని కళ్లమీద వెన్నుకటి జోడు ఒకటివుంది. తదేకదృష్టితో, బేనీబాబు మాటను అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తున్నట్టుగా

వారివంక చూస్తున్నాడు, కాని యేమీ అనలేదు. బేనీబాబు అక్కడ అంతకంటే యెక్కువ సైం వుండలేక పోయాడు.

వారు వాకిట్లో ఒకతొట్టెదగ్గర నిలబడ్డారు. పైపు నీరు తొట్టెలో పడుతోంది. నేను వారికివెనుక వుండిపోయాను. ఆయన దగ్గరకు చేరిన తరువాత ఆయన అన్నారు.—"నీవు యీ మిస్త్రీ నేత్రాలను చూచావా? అతడు యేమీ చెప్ప లేక పోయాడు. కాని అతని నేత్రాలు నాకు చెప్పిన మాటను నేను సహించుకోలేక పోయాను. నేను 'ప్రతిఫలం అనుభవిస్తా'వని చెప్పి అతడ్ని గాయపరచటానికి, అవమానపరచడానికి ప్రయత్నించానని అనుకుంటున్నాడు. కాని అతడు నామాటకు జవాబివ్వకుండా నాకు కొట్టినదెబ్బ – భయంకరమైన దెబ్బను వాడు తెలుసుకోలేదు... తెలుసుకోలేదు కూడాను. నేను తప్పుడు దారిని పోతున్నానని వాడేకాదు. యెంతోమంది అనుకుంటూండగా నీవు చూడవచ్చు. నేను యీ పనిలో ప్రవేశించిన పదిహేనుసంవత్సరాలనుండి ఎక్కడయిల్లు కట్టినా, యీమిస్త్రీనే పిలుస్తూవచ్చాను అప్పుడప్పుడు వాడు యేడిచేటంత గట్టిగా మాట్లాడుతూ వుండేవాడిని. కాని వాడు యెప్పుడూ తలబిరుసు జవాబు యివ్వలేదు. అతని ఆ పాతజోడే; ఆ లోతుకుపోయిన కళ్లే! అతడు యెప్పుడూ నాదగ్గర మజూరి నిర్ణయించుకోలేదు. పని పూర్తయిన తరువాత మజూరితోపాటు కొద్దో గొప్పో బహుమతి పొందని రోజుకూడా లేదు...కాని, యివన్నీ తెలిసి వుండినప్పటికీ నాలుగుమాటలు అనాల్సివస్తుంది. దానివల్ల కళా

కాయనిలో నిద్రిస్తున్న కల్పన మేల్కొంటుంది."

మరల బేనీబాబు తిరుగుతూ స్త్రీలు దిమ్మిస చేస్తున్న చోటుకి చేరారు. వారితోపాటు నేనుకూడా వచ్చాను. అకస్మాత్తుగా, వారు మమ్ములను చూచిన వెంటనే పాట ఆగిపోయింది. అక్కడకు రాకుంటేనే బాగుండే దనిపించిందినాకు. ఏమీ లేకపోయినా ఆ శ్రావ్యస్వరం అన్నా వినేవాళ్ళం! ఆ రాగం, ఆ పల్లవి-యెప్పుడూ మరచిపోలేం. ఎంత చిన్నదో అంత అమాయకురాలు!......

బేనీబాబు నిలబడి అటు యిటు చూచారు. చూచి-"యిటు చూడండి! దిమ్మిసలన్నీ ఒకేపర్యాయం పడాలి. శ్రుతిగలపకుండా యేపనీ చేయకూడదు. మరోమాట! "యివ్వాళ పని—దిమ్మిసపని పూర్తికావాలిసుమా!" అన్నారు.

రామలఖన్ "సరకార్! యివ్వాళ యెట్లా పూర్తవుతుందండి?"

"వాగబోకురా, రామలఖన్. పని పూర్తికాకపోతే డబ్బులు పూర్తికావు. పనికి మరోపేరే పైసా యని యింకా తెలుసు లేకపోయూవా?"

రామలఖన్ మౌనంగా వుండిపోయాడు.

బేనీబాబు ముందు, తరువాత నేను వెళ్ళిపోయాం. మేము వెళ్లటంతోటే దిమ్మిసధ్వని, వేగం, గాజుల గలగల, వారి స్వరం అన్నీ పెరిగిపోయాయి. నేను బేనీబాబుతో— "తమకు పని చేయించుకోటం బాగా తెలుసు" అన్నాను.

వారు నవ్వుతూ అన్నారు-"నాకు అన్నీ తెలుసు తమ్ముడూ! కాని తెలుసుకోటంతోనే సరిపోదు. జ్ఞానాన్ని మించింది మరోవస్తువు వుంది. దానిని తెలుసుకోవాలి. దానిని యిప్పటివరకు తెలుసుకోలేకపోయాను."

నేను-"అదేమిటి?"

వారు-"సత్యాగ్రహణం!"

నేను-"సమస్యను చెప్పి వూరుకోకండి! కాస్త నచ్చ చెప్తూ నడవండి!"

అప్పుడు వారు ఒక చెట్టుక్రింద - రోడ్డుమీదే ఒక ప్రక్క - కుర్చీలు వేయించి కూర్చున్నారు. నన్నుకూడా కూర్చోమని సైగచేస్తూ అన్నారు- "యిక్కడ కూలి చేసుకుందామని వచ్చిన ఆ స్త్రీలు వుదయం యెప్పుడనగా వచ్చారు? యెప్పుడు వెళ్ళతారు? ఒకతె పాలుత్రాగే పిల్లను వదిలిపెట్టి వచ్చి వుంటుంది. మరొకదాని భర్త పని చేసుకోటానికి పొలం పోయివుంటాడు. ఒకొకదానికి 'నా' అనేవారే వుండరు. పని చేస్తూచేస్తూ వుండగా వారికి వాళ్ళవాళ్ళు గుర్తుకొస్తే పనిలో క్షణంపాటు ఆటంకం యేర్పడుతుంది. మన యీ సమాజం, మన యీ సామాజిక వ్యవస్థ దానినికూడా ఓర్చుకోలేక వుంది. అయినప్పటికి మనకు అంతా తెలుసని, మనం పెద్దమనుష్యులమని అనుకుంటూవుంటాం. మనం కేవలం యిక్కడ పనిచేయటానికి వచ్చిన స్త్రీ కూలిచేస్తోందని, దానికే మనం కూలియిస్తున్నామని సంతోషిస్తాం! ఆ స్త్రీ స్థితి యేమిటో తెలుకోవాల్సిన అవుసరం

మనకు లేదనుకుంటాం; పుట్టినపిల్ల కన్నతల్లిమీద తనభరణపోషణ భారం పెట్టుతుందని మనకు తెలిసివుండీకూడా తెలుసుకోలేక పోతున్నాం. మనస్వార్థాలు, మన కోర్కెలు ఎంతనిరంకుశత్వముతో బంధిస్తాయి; సత్యాన్ని ఎంతనిరంకుశత్వంతో బంధిస్తాయి!"

బేనీబాబు ఆగిపోయారు. పైన విశాల ఆకాశంలో పక్షి సమూహాలు తమ రెక్కలనువిప్పి, యేటువంటి నిర్బంధాలు, నియమాలు లేకుండా ఆనందంతో హాయిగా యెగిరిపోతూ వున్నాయి. మా యిద్దరిదృష్టి వాటిపైకే పోయింది. నేను మాత్రం మరొక పర్యాయం తలవంచి బేనీ మాధవ్‌గారి వంక చూచాను. ఆయన బట్టతల బయటపడింది. దానిమీద అక్కడక్కడ కొద్దివెంట్రుకలు మాత్రమే మిగిలాయి. అవి యీ సంధ్యాప్రకాశంలో మెరుస్తున్నాయి. ఆయన—"ఇక యెప్పుడూ ఈపని చేయను" అన్నారు.

వారి వాక్యం అసంపూర్తిగానే వుండిపోయింది. ఏదో నిర్ణయం చేసుకుంటూ, ఆగిపోతున్నట్టున్నారు. ఆగాలనుకొని ఆగటంలేదు. ఆగవద్దనుకొని ఆగిపోతున్నారు.

నావంక చూస్తూ మరల అన్నారు—"నీ వింకా ఆవిషయాన్ని అర్థం చేసుకోలేవు! అంటే ఆ విషయాన్ని అర్థం చేసుకునే సామర్థ్యం నీలోలేదని మాత్రంకాదు సుమా! నీలో ఆలోచనాశక్తి వున్నది. ఆలోచించగలవు. అందువల్లనే నేను— మానవుడు తన నమ్మకాల మీద ఆధారపడి వుంటాడని చెప్పాలనుకుంటున్నాను. కాని యేమనుష్యుడైతే తన విశ్వాసాల

మీద, నమ్మకాలమీద ఆధారపడివుండడ్డో, పాడుకూడా మని పేనా? వాడు మనిషికాదు. వాడు పశువు,—పశువు!...కాని పశువు తన నమ్మకాలకు విరుద్ధంగా ప్రవర్తిస్తుందని యేవిధంగా చెప్పగలను? అది—అవును. అది తనప్రవృత్తులనుబట్టి నడుచుకునే ఒక స్వరూపం. మరి యీ మనుష్యుడు? ఛీ! యింతకంటే అధమస్థితి వుంటుందా?"

అప్పుడు వాతావరణంలో కావాల్సినంత గంభీరత వచ్చేసింది. ఆరోజుల్లో యిటువంటి గంభీరత అంటే నాకు అయిష్టంగానే వుండేది. అంతేకాదు, మిత్రులెవరన్నా అటువంటివ్యక్తుల పరిహాసం చేస్తుంటే నేనుకూడా కొద్దో గొప్పో అందులో పాలు తీసుకునేవాడిని. దానికి కారణం: ఆరోజుల్లో మరొక భావం మాలోవుంది. మేమందరమూ కూడా "జీవితం ఒక ఆటబొమ్మ లాంటి వస్తువు" అనుకుంటూవుండే వాళ్ళం! అందువలన యీ అనిశ్చితమైన, అకల్పితమైన జీవితాన్ని కేవలం యేడ్పు మొత్తుకోళ్ళతో గడిపేస్తే యేంలాభం వుంటుందా? అన్నప్రశ్న మా యెదుటవుండేది యెల్లప్పుడూ.

అందువలన నేను—"వాళ్ళందరి కంఠాలలో – అదుగో ఆమధ్య వినపడే కంఠం చాలా శ్రావ్యంగావుంది" అన్నాను.

ఒకక్షణంలో ప్లేటుమార్చి—"వెళ్ళు, దగ్గరకుపోయి విను. హేట్‌ను యిక్కడనే పెట్టిపో! అయినా, వాళ్ళు పాట నాపేస్తే—"పనిలో ఆటంకం రాకూడదు. పాడపాడుతూ దిమ్మిస వేస్తుంటే పని బాగా సాగుతుంది అని చెప్పు". అన్నారు ఆయన నవ్వుతూ.

నేను వెళ్లిపోయాను. చాలనిశ్శబ్దంగా, చాల నెమ్మది నెమ్మదిగా, చప్పుడు చేయకుండా...అయినా వాళ్లకు తెలిసింది. పనిలో చురుకుదనం వచ్చింది. కాని, పాట ఆగిపోయింది.

నేను–"మీరు పాటయెందుకు ఆపారు?" అన్నాను.

పకపక నవ్వులు: ఒకరిమీద మరొకరు!

ఎవరో తన పక్క అమ్మాయితో – ఒక తోపుతోసి– "పాడవే లచ్చి! ఆగిపోయా వెందుకు?" అంది.

"నీవెందుకు పాడకూడదు చిన్నబాబుగారి యెదుట?"

"అబ్బ! ఎంత సిగ్గంటేనూ, పెళ్లికొడుకును చూడనట్టు?"

నేను–"పోట్లాడుకోకండి! నేనే పోతున్నాను" అందామనుకున్నాను. కాని అనలేకపోయాను. మెదలకుండా వెళ్ళినట్టే తిరిగి వచ్చాను.

తిరిగయితే వచ్చాను: కాని పకపక నవ్వుతూ, పాడటం అంటే సిగ్గేసి తలవంచుకున్న 'లచ్చి'ని మాత్రం చూడటానికి ప్రయత్నించ లేదు.

ఎంత వుల్లాసంతో వచ్చాను! ఎంత నిరాశతో, ఎంత అంతక్షుబ్ధంతో బయలుదేరాను.

బేబీబాబు చాల ఆప్యాయతతో–"ఏంజరిగిందో చెబితే నేనుకూడా వింటానుగా!" అన్నారు.

నేను–"ఏం చెప్పమంటారూ? జరుగుతుందనుకొన్నదే జరిగింది. నేనువెళ్లటంతోటే వారు పాడటం మానేశారు"అన్నాను.

"నీవు నేను చెప్పినమాట అనలేదా?"

"దానిని నేను అనలేక పోయాను."

"అంటే నీవు సిగ్గుపడ్డా వన్నమాట."

నేను మౌనంగా వుండిపోయాను. దొంగతనం చేయకుండా, అసలు దొంగతనం యెట్లా చేయాలోకూడా తెలియని అమాయకుణ్ణి దొంగగా చేస్తే వాడు నిజంగా తప్పించుకోలేడు. మాటల్లో వ్యతిరేకికి మరింతబలం చేకూర్చుతాడు. తాను చిక్కుకు పోతాడు. అటువంటిస్థితే నాదికూడా. బేనీబాబు అటువంటి అగాధంలోకి తీసుకువెళ్ళా రని నాకేం తెలుసు ?

బేనీబాబు—"అయితే, ఒక పని చేయి ! రామలఖన్‌తో నేడు యీ పని పూర్తి కానట్టుంటే రేపే పూర్తిచేయమని చెప్పు. ఇంకా, తొందరేమీ లేదని, ఎంత త్వరగా చేస్తే అంత గట్టితనం తక్కువవుతుందని, అందువలన నెమ్మదిగానే చేయమని నేను చెప్పినట్టు చెప్పు" అన్నారు.

నేను వారివంక, నిర్వెర్గపోయి, చూస్తూ నిలబడ్డాను. ఈయన మనిషా ? లేక దైవమా ?

నన్ను మౌనంగా చూచి—"ఏమిటి ఆలోచిస్తున్నావు?" అని అడిగారు.

నేను—"ఏమీ లేదు, యిన్నిరోజులనుండి మీతో పరిచయం వుండీకూడా మిమ్ములను అర్థం చేసుకోలేకపోయానేమా ! యని" అన్నాను.

వారు — "యిదేమంత గొప్ప విషయంకాదు తమ్ముడూ ! న్యాయానికి, సత్యానికి, మనం యెంతదూరంగా

వుంటున్నామో, మనకే తెలియదు...వూహించుకో లేము కూడాను...సరే, నీకిచ్చిన పనిని పూర్తిచేసుకురా! ”అన్నారు.

నేను మరల ఆ డాబామీదకే వెళ్ళాను. కాని యిప్పుడు మాత్రం ఆపాట సాగుతూనేవుంది. కాని ఒకేపాట యెప్పుడూ పాడుతూ వుండటం అసంభవం. అయినా నాకు యిదివరకటిదా వినా లనిపించింది. అప్పుడు నాకు కొద్ది క్షణాలముందు బేసీబాబు చెప్పిన—“మానవుల కోర్కెలకు అంతువుండదు” మాట గుర్తుకొచ్చింది.

నేను రామలఖన్‌ను పిలిచినప్పుడు, అతను భయ పడ్డాడు—“ చిన్న దొరగారూ! ఏమిటి ఆజ్ఞ ”

నేను — “బేసీబాబుగారు మీ యెడ యే విధంగా ప్రవర్తిస్తారు ? ” అని అడిగాను.

అతడు మౌనంగా వుండిపోయాడు. ఏమీ చెప్పలేదు. అప్పుడు నేను వారికి విరుద్ధంగా చెప్పటానికి భయపడుతున్నా డేమో ననుకున్నాను. కాని, నేను—“వారితో యేమీరా చెప్ప నులే! కేవలం నిజమేంటో తెలుసుకోటానికి అడుగుతున్నాను. నిర్భయంగా చెప్పు.” అన్నప్పుడు అతడు—“ పని చేయించు కుంటారు. కూలియిస్తారు. ఆ యివ్వటం సరైన సైముకి, అందరికంటే ఒకఅణా యెక్కువ. ఇటువంటివారు దొరికితే నేను జీవితం పొడుగూనా గులాముగా వుండిపోతాను” అన్నాడు.

నేను— “నీవు నిజం చెప్తున్నావు. వారే నన్ను యివ్వాళ పని పూర్తికాకపోతే రేపు పూర్తి చేసుకొమని చెప్పి

రమ్మన్నారు. ఇంకా, యెక్కువ కష్టపడటంకూడా అనవసరమని, అందువల్ల ఫలితం వుండబోదని కూడా చెప్పినారు" అన్నాను.

రామలఖన్-"కాని చిన్న బాబుగారు: వారు వెనుక ముందు ఆలోచించి చెప్పారు. ఇవ్వాళ పనిపూర్తి కాకపోతే రేపు పూర్తిచేసుకోమని చెప్పి రమ్మన్నారు; సరే, బాగానే వుంది. కాని రేపు పండుగ. అదికాకుండా, సున్నం బిగుసుకు పోతుంది. అందువల్ల వారు ముందు ఆలోచించే యివ్వాళ పని పూర్తి చేయమన్నారు. తరువాత ఆలోచిస్తినిగదా నాకు యివన్నీ గుర్తుకొచ్చాయి. పనికూడా చాలా భాగం అయి పోయింది. మిగిలింది సాయంత్రానికి పూర్తిఅవుతుంది. బహు కొద్ది కష్టం—ఒకళ్లిద్దరి చేతుల్లో వుండ్లుకూడా పడ్డాయి. కాని యీ విషయం మీరు వారితో చెప్పకండి. తిరిగి మమ్మ లనే కోప్పడతారు."

రామలఖన్ చెప్పిన మాటను నేను నిజంగానే బేబీ బాబుతో చెప్పలేదు.

కాని, ఆరోజునే సాయంకాలం......

ఒకప్రక్క మెట్లగోడ పడిపోయింది. పనివేళ అయి పోయింది. కూలీలు అటు యిటు తిరుగుతున్నారు. ఇంతలోనే 'ఢమఢమ ఢమ'తో పాటు ఓ క్షీణస్వరం—"అబ్బ!"

కూలీలంతా పరుగెత్తారు. లెక్కపెట్టబడ్డారు. అందరూ కలసి యివ్వాళ పనికొచ్చింది, యిరవై తొమ్మిదిమంది. కాని లెక్కకు యిద్దరు తక్కువవుతున్నారు.

అవును! ఈ క్షీణస్వరం! యిది! యిది!

రాళ్లను దీస్తుండగానే ఒకస్త్రీ-"అరె! అదిలచ్చే! లచ్చి! అదే కనపడటం లేదేమాయని ఆలోచిస్తున్నాను. కాని తను వాత యింటికి త్వరగాపోయిందేమో అనుకున్నాను. చివరకు అదే!......" అని ఆగిపోయింది.

ఆ క్షీణస్వరం యింకా వినపడుతూనే వుంది.

"అరె! ఆ పెద్ద అట్టను లేపండోయి ముందు. దానిక్రిందే యింకో మనిషియున్నాడు" అంటూ అందరూ కలసి ఆ అట్టను లేపారు. అదిరాళ్లమీాదపడింది. అందువల్ల మధ్యలోకొద్ది సందు వుండిపోయింది. ఆ సందులోనే నిస్పృహాలోవున్న గిరిధర్ బయటపడ్డాడు.

కొద్దిరోజులలో గిరిధర్ తేరుకున్నాడు. అతని వెన్నెముకయితే విరిగిపోయింది; కాని, వాడు తిరుగుతున్నాడు. పని చేసుకుంటున్నాడు.

ఈ బంగళాను బేనీబాబు తయారు చేయలేకపోయినారు. కొన్ని రోజులకు పని ఆగిపోయింది. ఆయన జబ్బుపడ్డారు.

ఆ రోజుల్లో నేను-మానవుని జీవితం యింత క్షణభంగురమా యని ఆలోచిస్తూ వుండేవాడిని. వారు జబ్బుపడ్డారు. అది యేరోజు కారోజు వుధృతమవుతోందికాని తగ్గటంలేదు. బహుశా! బేనీబాబు జీవించటం కష్టమైపోతుందేమో అనుకొంటున్నాను. కానీ ఒకరోజున ఆయన మరో రూపంలోనే

కనపడ్డారు. మృత్యువు వారిని నలిపేయటానికి బదులు వారే మృత్యువును నలిపివేస్తున్నారు. వారి దెబ్బ తట్టుకోలేక అది గిలగిల తన్నుకుంటోంది. పారిపోవటానికి ప్రయత్నిస్తోంది కూడాను.

వారు ఒక మంచంమీద పండుకొని నెమ్మది నెమ్మదిగా మాట్లాడుతున్నారు. వారిదగ్గర ఒక యువకుడు కూర్చొని యున్నాడు. వాడు పసన్నంగా వున్నాడు. బేనీబాబు అతనిని యేదో అడుగుతున్నారు. ఆ క్షణంలోనే నేను అక్కడకు వెళ్ళాను. వారు లేవటానికి సిద్ధపడితే నౌకరు సహాయంచేసి కూర్చోపెట్టాడు. వారి వెనుక ఒక తలగడకూడా పెట్టాడు. మొట్టమొదట కళ్లకు జోడులేదు. ఆయన అప్పుడు పెట్టుకున్నారు.

వారిసంజ్ఞతో నేను వారిదగ్గరలోనే కుర్చీలో కూర్చున్నాను.

వారు అన్నారు—"వింటున్నావా, వెంకన్నా! నేను నిన్ను యేడ్వనీయను. నిన్ను యేడ్వనిస్తే నన్ను నేనే కోల్పోతాను. నేను అంత తేలికైన వస్తువునుగాదు. నేను చావాలనుకోటంలేదు. అందువల్లనే నిన్ను నవ్వుతూ వుండగా చూడాలనుకుంటున్నాను. నీవు యేవిధంగా సంతృప్తిపడతావు? నీకు యేం కావాలి? ఇంకోమాటకూడా యిప్పుడే చెప్పాలనుకుంటున్నాను. నేను నీకేదైనా యివ్వాలనుకుంటున్నాను. నీవు యెన్ని రూపాయిలు పొంది సంతోషించగలవు. కాని నీవు—

ఆ రూపాయిలు నీ భార్య విలువ అని అనుకోవద్దు. 'ఒక స్త్రీ—ఒక నవయువతి, ఒక అపూర్వసౌందర్యవతిని రూపాయిలతో కొనుక్కోగలమా? ఛీ! యిది మూర్ఖత్వం! పశుత్వం! కాని నేను నీతో యిప్పుడే చెప్పానుగా! నేను నిన్ను సంతోషంతో నవ్వుతూండగా చూడా లనుకొంటున్నా నని."

"అబ్బ! ఒక యువతి — ఒక సుందరి!"

అయితే! లచ్చి అందకత్తె కూడానా?......

అయితే! ఆమె కోమలకంఠంతో పాటు......

బేనీబాబు—"నీవు యేమీ చెప్పలేవని నాకు తెలుసు. అయితే అదికూడా నేనే చెపుతున్నాను. విను. దానిపిల్ల పోషణకు పదిరూపాయల చొప్పున ప్రతిమాసం తీసుకెళుతూవుండు. విన్నావుగా! ఇవిగో పదిరూపాయిలు! నేడు షష్టుతారీఖు. ప్రతి మాసం షష్టుతారీఖున వచ్చి తీసుకెళుతూవుండు" అంటూ జేబులోనుండి పదిరూపాయిలనోటు తీసి వెంకన్నకి అందించారు. వెంకన్న యెంత సంతోషించాడో నేను గ్రహించగలిగాను.

వెంకన్న వొలుకుతున్న ఆనందాశ్రువులతో వెళ్ళిపోయిన తరువాత బేనీబాబు నాతో—"వీడు అంతటితో సంతోషిస్తాడు అనుకుంటాను. నీ అభిప్రాయమేమిటి తమ్ముడూ!" అన్నారు.

నేను విస్తుపోయి, ముగ్ధుడనై—"అరె మీరు యేంచేస్తున్నారు." అన్నాను.

"నీవు నన్ను — తమ్ముడూ! నీవు నన్ను యేంచేస్తున్నావని అడుగుతున్నావు. అంతేగా! నన్ను నేనే మభ్యపెట్టుకుంటూ

నికి ప్రయత్నిస్తున్నాను." మానవుడు తనను మభ్యపెట్టుకోటానికి ప్రయత్నిస్తూవుంటాడు. నేను ఆ తప్పునే చేస్తున్నాను. మృత్యువును ఆహ్వానిస్తున్నానని నాకు తెలుసు. అందువల్లనే ఒక తప్పు చేసి నన్ను నేనే మరచే.పోదామని నిశ్చయించుకున్నాను. తనను తానే కోల్పోవాల్సిన అవుసరం జీవితంలో ఒకప్పుడుకాక పోతే మరొకప్పుడన్నా తప్పక వస్తుంది. నా జీవితంలో అటువంటి అవుసరం యిప్పుడు వచ్చింది. కాని యిది నాతప్పు కాదు. ఇది నా నవజీవితం! యిది నా నవచైతన్యం" అన్నారు బేనీబాబు. నేను వింటూ ఒక నిట్టూర్పు విడిచాను.



" బెనీపురి "

# అసమత

హజారీబాగ్ రోడ్ స్టేషన్! నలుగురు ఖైదీలు వైటింగ్ రూమ్‌నుండి బయలుదేరి ప్లాటుఫారంమీద షికారు చేస్తున్నారు.

ఎండాకాలంలో ప్రాణానికి చల్లదనం చేకూర్చు యీ సాయంకాలం యెంత బాగుంటుంది! యెంత హాయిగా, యెంత మనోహరంగా వుంటుంది! నలువైపులా బూడిదరంగులో ముంచెత్తబడిన పర్వతాలు! దూరాన ఒక పర్వతాన్ని అలంకరించి, నేత్రపర్వంగా వున్న పారసనాథుని మందిరం! పశ్చిమమున సూర్యభగవానుడు తన మిగిలియున్న బంగారాన్ని పంచిపెడుతూ, పట్టరాని సంతోషంతో తన ప్రియురాలైన సంధ్యాదేవితో వీడ్కోలు పుచ్చుకోబోతున్న ఆ ఘట్టం! తూర్పున చతుర్దశినాటి చంద్రుడు తన శీతలకిరణాలను ప్రసరింప చేయటానికి తహతహలాడుతూ చూపిస్తున్న ఆ మానవ ప్రేమ! ఆహా! ఎంత మనోహరం! యీ సమయాన్నా యేదైనా పుణ్య కార్యం జరుగుతోందా?

ఆగి ఆగి చల్లటి గాలితోపులు పగలంతా మండిన అగ్ని మంటలను మరపించటానికి ప్రయత్నిస్తున్న యీ సమయంలోనే ఒక బాలిస్ట్రైన్ ప్లాటుఫారంమీదకు వచ్చి ఆగింది.

ఒక పెద్ద పెట్టెల వరుస. పెట్టెలనిండా కంకరరాయి! రాళ్ళమీదనే కొంతమంది కూర్చొని తమతమ సుత్తులతో ఓ కొడుతూ రాళ్ళను ముక్కలు-ముక్కలుగా చేస్తున్నారు; కొంత

మంది యినుప పొయ్యిలలో బొగ్గు వేసి వూదుతున్నారు- అంతటా పొగ కమ్మింది. మరికొంతమంది పెద్దపెద్ద రాళ్ళను తల గడగా చేసుకొని నిద్రపోతూ గురకలు కొడ్తున్నారు. వారి గురకలు చక్కగా వినపడుతున్నాయి. వారి తలవైపున యెండీ యెండని తాటాకులు నిలబెట్టబడియున్నాయి. వాటిని ఎండనుండి తప్పించుకుంటానికిగాను నిలబెట్టివుంటారు. మరి కొంతమంది నిలబడి స్టేషన్ వైపుకి చూస్తున్నారు-వీరిలో కొంతమంది దృష్టి యీ ఖైదీలమీదకు పోయిందంటే అబ్బురం యేమీ లేదుగదా!

ఈ బాబూలు, పోలీసు నిగరానీలోనా? ఎంత ఆశ్చర్యం. ఒకడు ఆ ఖైదీలదగ్గరకు వెళ్ళాడు-బహుశా ! తమ పుచ్చిపోయిన బ్రతుకుల బాధలను చెప్పుకోటానికేమో !

" నీ కెంత కూలిస్తారు, సోదరా ! "

" సోదర్రా ! " ఆ అడిగే ఖైదీవంక ఒక్క క్షణంపాటు నివ్వెరపోయి చూచాడు. " సోదరా ! "—యీ శబ్దం అతను యీ గడచిన జీవితంలో వినలేదు. అతనిని పిలిచే శబ్దాలలో యింత మెత్తటిశబ్దం య్కెక్కడా యేమూలా లేదేం ?

" నేను నిన్నే అడుగుచున్నాను మిత్రమా ! మాట్లా డవేం ?" మొట్టమొదట " సోదరా! " యిప్పుడు 'మిత్రమా! అతడు సంకోచిస్తూ-"నాలుగణాల్లు!" అన్నాడు.

" ఎన్నిగంటలు పనిచేస్తారు ? " యీ నిరర్థకప్రశ్న విన్న అతని భయం పెరుగుతున్నట్టుంది.

" ఉదయాన్నుండి-సాయంత్రంవరకు "

"ఇక మధ్యలో ఖాళీవుండదా ?"

"వుండకేం ? మధ్యలో ఒకగంట ఖాళీవుంటుంది."

"అయితే మీ యింట్లో యెంతమంది వున్నారు ?"

"అయిదుగురం—నేను, అమ్మ, నా భార్య, యింకా యిద్దరు పిల్లలు."

"ఇంకా యిద్దరు పిల్లలుకూడానా ?"

"అవునండి"

"తండ్రి చనిపోయాడా ?"

అతడు 'వూఁ' అంటూ తలూపాడు.

"నాలుగు అణాలతో అయిదుగురు యే విధంగా జీవించ గలుగుతున్నారు ?" యీ ప్రశ్న విన్న అతని భయం అంతిమ దశకు చేరినట్లుంది. కాని యింజను యింతలోనే అతనిని పిలిచింది. ఈ ఆలస్య మయినందుకే గర్జించింది. ఈ గర్జనను తట్టుకోలేక అతడు పరుగెత్తుకొని పోయి బండెక్కాడు. బండి కదిలింది. మసకమసకగా వున్న ఆ ప్రకాశంలో ఆ కూలి తనకు నమస్కారం చేస్తున్నట్లు చూచాడు ఆ ఖైదీ.

"ఈ లోపల స్నానం పని వదిలించుకుంటే బాగుంటుం దిగా ? అన్నాడు ఒకఖైదీ, ప్లాటుఫారం మీదపైపు చూచి.

పైపు తన విసురుకొద్దీ నీటిని విసురుతోంది. కాని ఖైదీ మనస్సుకి శాంతి లేదు, విశ్రాంతి లేదు. అతని మనస్సులో బాలీస్ సైర్ని పరుగిడుతోంది. ఆ కూలి సుత్తిదెబ్బ అతని తల మీదనే పడుతున్నట్టుంది. ఆ కూలీలు ! ఆ నిద్ర! ఆ పుచ్చి

పోయిన బ్రతుకులు, ఇవన్నీ కూడా అతని హృదయంలో తుఫాను రేపుతున్నాయి. ఇక ఆ మనస్సుకి శాంతి యెక్కడిది? విశ్రాంతి యెక్కడిది?

అప్పుడు ఆ ఖైదీదృష్టి ప్లాటుఫారంకి కొంచెం దూరాన విద్యుత్ కాంతిలో మిలమిల మెరుస్తున్న ఒక పెట్టెమీదకు పోయింది. ఆ కాంతిలో లోపలి దృశ్యాలన్నీ స్పష్టంగా కనబడుతున్నాయి. ఒక సజ్జనుడు—కాదు, కాదు, ఆయనగారికి బాబుగారని పిలిపించుకోవాలని వుంటుంది-కుర్చీమీద కూర్చొని యున్నాడు. అప్పుడే బాత్ రూమ్‌నుండి వచ్చినట్టున్నాడు. విద్యుత్ కాంతిలో మిలమిల మెరుస్తున్న నీటి బిందువులు! ఆహా! ఎంత రమ్యంగా వున్నవి! పచ్చటి పైరు పైనున్న మంచుబిందువులకు సూర్యకిరణాలు తమ సప్త రంగులను పూసినాయా అన్నట్టున్న ఆ నీటి బిందువులు ఎంత మనోహరంగా వున్నాయి! ఆయన అద్దంయెదుట నిలబడి తన వెంట్రుకలను దువ్వుకుంటుంటే పంఖావల్ల అవి మరల ముఖంమీదకు వస్తున్నాయి. ఆయనకుకూడా వెంట్రుకలపిచ్చ బాగా వుందనుకుంటాను. దువ్వుతూ మరల కొంచెంసేపు, అవి ముఖం మీదకు యెప్పుడు వస్తాయాఅని ఎదురు చూస్తున్న ఆయనకు వెంట్రుకల పిచ్చ లేదని యెట్లా అనుకునేది? నెక్ టయ్ కట్టుకున్న తరువాత అద్దంలో చూచుకొని తన అందానికి మురిసిపోతున్నట్టు వున్నాడు. ఆయనతోపాటు ఆయన-అద్దంలోని-ప్రతిమూర్తికూడా బాగుగానే కనపడుచున్నది.

ఇంతలో, ఒక మనిషి, కాదు, కాదు! ఒక నౌకరు ట్రేతో హాజరయ్యాడు. అతడు టేబిల్ మీద ట్రే పెట్టి దాని పైనున్న వైట్ క్లాత్‌ను తీశాడు. అందులోనున్న వస్తువులను ఒకక్షణంపాటు కలియచూచి బాబుగారు నౌకర్ని కాల్చేద్దామా అన్నంత కోపంతో కంట్రోల్ చేసి చూస్తున్నారు.

ఏభై గజాల దూరాన వున్నప్పటికి విద్యుత్ కాంతిలో అతను చూసే చూపులు యిక్కడకుకూడా స్పష్టంగానే కనపడుతున్నాయి. నౌకరు వెళ్ళాడు—మరల రెండుమూడు క్షణాల తరువాత యేదో తీసుకొచ్చాడు. ఏదో తరళపదార్థాన్ని గొంతులోకి జారపోస్తున్నారు.

స్నానంచేస్తే ఖైదీ హృదయంలో మండుచున్న హోమంలో యిది అర్ఘ్యమయింది. ఇంధనంలా అయింది. వైటింగ్ రూమ్‌లో కెళ్ళాడు.

"ఈయనగారెవరు?"

"ఆ సెలూన్‌లోనా?

"అవునండి!"

"రైల్వే కంట్రాక్టరు — అభ్రకం వ్యాపారంకూడా వుంది."

"వాన్ వచ్చింది. పదండి! పోదాం!"

వాన్ ఫ్రంట్ సీటులో ఖైదీలు నలుగురు కూర్చున్నారు. ఇనస్పెక్టరు డ్రైవర్ ప్రక్కన. మిగతా నలుగురు పోలీసులు వెనుకనున్న సీటులో."

అర్ధరాత్రివేళ. ప్రశాంత సమయం. రోడ్డు కిరువైపులా చెట్లు. దూరాన ప్రకృతి వొడిలో నిద్రపోతూన్న పర్వతాలు! పిండారబోసినట్లు వెన్నెల కాస్తోంది. చల్లటిగాలి హృదయానికి హత్తుకుపోతోంది. హాయిగా వుంది.

కాని ఈ సమయంలో ఒకని మనస్సు-నీటినుండి వేరు చేయబడి నిప్పులు కురుస్తున్న యెండలో పెట్టబడిన చేపవలె బాధపడుతోంది...

ఆయన కంట్రాక్టరు! రైల్వే కంట్రాక్టరు. రైల్వే లైన్లను సరిచేయడం, యిక అవసరమైతే వంతెన్లు, స్టేషన్లు కట్టడం-ఇది ఆయన పని. ఆ బాలిస్ట్రైకర్ కూలీలు ఆయన హయాంలోనే పని చేస్తుండవచ్చు.

ఆయన కంట్రాక్టరే! అయితే ఆయన చేసే పనేమిటి? చేస్తున్న పనిని చూస్తూండటమా? అదికాదు. ఆ పని యింజినీయర్లు ఓవర్‌సీయర్లు చేస్తారు. ఇకయితే, యీాయన చేసే పనేమిటి?

ఆయనివి రూపాయిలు! ఆ రూపాయిలతో యీా కూలీలను-కాదు, కాదు; వీరి శ్రమను కొంటాడు. వాళ్ళతో యిష్టమొచ్చినంత పని చేయించుకుంటాడు. తన యిష్ట మొచ్చినంత మజూరి వసూలు చేసుకుంటారు.

శ్రమ ఒకనిది, ఫలితం మరొకనిది.

ఇక అభ్రకం వ్యాపారం? ఏం వ్యాపారమయి వుంటుంది? యిట్లాగే...లేకపోతే యేదో గని వుంటుంది.

కొంతమంది కూలీలు చస్తూవుంటారు. వాళ్ల కర్మ చేస్తూ వుంటాడు ఆయన.

కాని ఒకమాట తప్పక ఆలోచించాలి. రూపాయిలకి- పెట్టుబడికి, కొంత లాభం తప్పక వుండాలి. దానిని కాదనేది యెవరు?

కాని యీ రూపాయిలు యెట్లావచ్చాయి. ఇదేవిధంగా యేదో ఒకసారి తోసుకువచ్చివుంటుంది. లాభంరూపంలో కాకపోయినా, వడ్డీరూపంలోనో, అద్దెరూపంలోనో వచ్చి పడి వుంటుంది ఆ ధనమంతా.

ఎంత మహాపాతకం! ఎంత మహాఅన్యాయం! చేసే వాళ్ళు ఆ బాలిస్ట్రైక్‌లో; పనిచేయనివాడు... చేయనివాడు ...అబ్బ! మహాఘోరం!

"వాహవా! వాహవా! వాతావరణం యెంత నిర్మలంగా, యెంత ప్రకాశంగావుంది. ఈ వేసంగిలోకూడా యెంత శీతలంగావుంది." ఇనస్పెక్టర్‌గారు వెనుకకు తిరిగి ఖైదీలవంక చూస్తూ అన్నాడు. బహుశా! యీ విచిత్రజీవులంటే ఆయనకుకూడా దయ కలుగుతోందేమో! వాళ్లయెడ సహానుభూతి చూపించా లనుకుంటున్నాడేమో!

కాని యీ సహానుభూతిని అర్థంచేసుకునే శక్తి వారిలో వుండొద్దూ? ముగ్గురు ఖైదీలుమాత్రం స్వప్నజగత్తులో విహరిస్తున్నారు.

ఇక నాల్గోవాడు క్షోభలోనే యున్నాడు. కాని

అతని యింద్రియాలన్నీ యెక్కడకక్కడకు కట్టుకట్టుకుపోయాయి! వాడు ఆలోచించుకుంటూనే బిగ్గరగా అరచాడు—

"ఈ విధంగా వున్నప్పటికి యీ అమాయిక ప్రజ యింకా సమానత్వం సమానత్వం అని అరుస్తారేమిటి!' అని అంటోంది."



యశపాల్

# రెండు కోణాలు

మానవుడు యెవర్నైతే తన సర్వస్వ మనుకొని, ఆనందం అనుభవిస్తూ, పరవశత్వం పొందుతూ, జీవితం గడుపుతూ వుంటాడో, వారి ద్వారానే అవమానానికి, అప్రతిష్ఠకు గురయి నప్పుడు అతడు యెంత వుద్రిక్తుడవుతాడో, యెంతబాధ పడ తాడో, మాటల్లో చెప్పటం మహాకష్టం; కష్టమేమిటి, అసం భవం కూడాను.

దిలీప్ హేమ కిచ్చిన స్వాతంత్ర్యాన్ని, గౌరవిస్తున్న పద్ధతుల్ని, ప్రేమిస్తున్న ప్రేమపోకళ్లను చూచి అందరూ విస్తు పోయి, తనలో తామే 'అతి' అని తీర్మానించుకుంటూ వుండే వారు. చివరకు యింతచేసినా, లోకుల విమర్శలకు గురయినా, అతడు ఆమెను సంతృప్తి పరచలేక పోయాడు. హేమ కేవలం దిలీప్ తన స్నేహితురాలితో కలసి 'సెకండ్ షో'కు వెళ్లినందు వల్ల ఆలస్యంగా వచ్చాడని, యింతకంటె తనకు వేరే అగౌరవం వుండబోదని అనుకొని, ఆ రాత్రంతా నక్షత్రాలను లెక్క పెడుతూ గడిపి, వెలుగురాగానే, కన్నవారింటికి దారితీసింది. అప్పుడు ఆమె దుఃఖానికి పట్టపగ్గాలు లేవు.

సెప్టెంబరు అంతిమ సప్తాహం. వర్షాకాలం గడిచిపోయి నప్పటికి ఆనాడు జోరుగా వర్షం కురుస్తోంది. దిలీప్ కిటికీ దర్వాజాలకు కర్టెన్లు లాగి హాలులో కూర్చుని గత సంఘటనలు జ్ఞప్తికి వస్తుంటే వాటని గురించి ఆలోచిస్తూ కూర్చున్నాడు.

అవమానంలో, అనాదరణలో, కాలం కాళ్ళమై మనిషిని మింగేస్తూవుంటుంది. ఒకొకఘడియ, ఒకొకగండం — ఒకొక యుగం. దిలీప్‌కు కాలం గడవటంలేదు. నిద్ర – గాఢనిద్ర పట్టితే గాని మానసికబాధ తగ్గదు. ఈ యీతిబాధలనుండి మానవుణ్ణి కొద్దిక్షణాల పాటైనా దూరంగా తీసుకెళ్ళి శాంతి ప్రదానం చేయగల్గింది ఒక్కనిద్ర! ఆ నిద్రాదేవత శరణ్యం పొందటానికి ప్రయత్నిస్తున్న దిలీపునకు, తన తమ్ముడు మెట్ల మీదనుండి దిగుతూవున్న చప్పుడు వినపడింది. మానసికవ్యధ తీర్చుకోటానికి ప్రయత్నిస్తున్న అతడు అర్ధనిమీలితనేత్రాలతో దర్వాజావంక చూచాడు.

తమ్ముడు కర్టెన్ ఒక ప్రక్కకు లాగి—— "అన్నగారూ! మీరు యెక్కడకూ వెళ్ళకపోతే మోటారుసైకిల్‌ను తీసుకెళ్తాను. ఏమంటారు?"

ఈ విఘ్నరినుండి శీఘ్రంగా విముక్తి పొందుదామనే వుద్దేశ్యంతో మాట్లాడనుకూడా మాట్లాడకుండా చేతితోనే సంజ్ఞ చేసి తీసుకెళ్ళమని చెప్పాడు.

గోడమీద గడియారం గగ్గోలు పెడుతూ ఆరు గొట్టింది. 'వ్యర్థజీవిలా వూరికే కూర్చుని కాలం గడపాల్సిందేనా?' అనుకున్నాడు. అతడులేచి కిటికీలోగుండా బయటకు చూచాడు. వర్షం ఆగిపోయింది. 'ఇక యెవడో ఒకడు వచ్చి హాస్యకొడతాడు' అనుకొని అతడు భయపడ్డాడు.

అతడు లేచాడు. లేచి తమ్ముని సైకిల్ తీసుకొని సందు

లోని బురదనుండి రక్షించుకుంటూ, యెవరి కంటా పడకుండా 'మోరి' గేటునుండి 'బ్రతికామురా, భగవంతుడా!' అను కుంటూ బయటపడ్డాడు. ప్రాత ఫసీల్ బాగ్ మీదుగా 'మింటో పార్కు'కి చేరుకున్నాడు. బావురుమంటూన్న ఆమైదానంలో పడమటి పిల్లగాడ్పుల పరవళ్ల తాకిడికి, గజగజ వణుకుతూ యెవడు కూర్చుంటాడు?

ఆ యేకాంతంలో సైకిల్‌ను ఒక బెంచీకి ఆన్చి నిలబెట్టి, అతడుకూడా దానిమీద చతికిల బడ్డాడు. తలమీదున్న హేట్‌ను తీసి బెంచీమీద పెట్టాడు. తలకు చెమ్మదనం తగిలి నందువల్ల అతనిమానసికవ్యథ కొద్దిగా తగ్గినట్లుంది.

చెమ్మ తగిలి, జలుబుచేసి, జబ్బుపడితే పరిస్థితి శ్రుతి మించి రాగాన పడుతుందని, తను అనుభవించాల్సిన దుఃఖంలో యెవరూ పాలు తీసుకోరని స్వయంగా తానే అనుభవించక తప్పదని అనుకున్నాడు.

అతణ్ణి విశ్వసించి. ఆనందం అనుభవించలేని వారికి అతని దుఃఖంలో పాలు పంచుకోగలశక్తి, అధికారాలు యెట్లా వుంటాయి.

'ఓరోజు మృత్యువు యెవరికంటా పడకుండా వస్తుంది. నన్ను మింగేస్తుంది. నాకు శాంతిని ప్రదానం చేస్తుంది. ఆ రోజున కన్నీరు కాల్వలుగా ప్రవహింపచేసేవారిలో హేమకూడా వుంటుంది. ఆరోజున నన్ను కోల్పోయి, తన కొచ్చిన అరిష్టాన్ని వూహించుకోనీ, తను చేసిన తప్పుకు పశ్చాత్తాప పడు

తుంది. ఇదే! పగతీర్చుకునే వుత్తమమార్గం యిదే! నాకు చేసిన పరాభవానికి, తగు విధంగా శిక్షించటానికి వుత్తమ మార్గం యిదే!' అని నిర్ణయించుకొని, సంతోషంతో ఒక నిట్టూర్పు విడిచాడు. చలిగాలిలో ఆలోచిస్తూ కూర్చున్నాడు.

అచ్చటకు సమీపంలో మూడుఫర్లాంగుల దూరాన వున్న రైల్వేలైనుమీద యెన్నో బండ్లు అటు ఇటూపోయాయి. కాని దిలీప్ ధ్యానం అటుపోలేదు. ఇప్పుడు ఫ్రాంటియర్ మేల్ తుఫానువేగంతో, తీవ్రకోలాహలంతో, నిప్పులుగక్కుతూ, పోతూన్నప్పుడు దిలీప్ అటుచూచాడు. ఫస్టు, సెకండ్ క్లాసుల పెట్టెల్లోనుండి అంధకారాన్ని చీల్చుకుంటూ వస్తున్న తీవ్ర ప్రకాశాన్నిచూచి అది ఫ్రాంటియర్ మేల్ అని, యిప్పుడు టైం తొమ్మిదిన్నర అయిందని అనుకున్నాడు.

తనయెడచేసిన అన్యాయానికి, ప్రతీకారం అనుభవించు 'ఆనాటి'ని వూహించుకొని మురిసిపోయాడు. అతని మనస్సు తేలికయింది. అతడు తిరిగి వెళ్ళటానికి లేచాడు. శరీరంలో కొద్దో, గొప్పో యింకా మిగిలియున్న శైథిల్యంవల్ల సైకిల్ మీద యెక్కకుండా అతడు కాలినడకనే కోటల్లోగుండా, బాదశాహీ మసీదుమీదుగా 'మింట్'గేటు, 'మింట్'నుండి 'ఖారీ'గేటుకు చేరుకున్నాడు. ఈమార్గం మధ్యలో అతనికి యెవరూ కనపడలేదు. రోడ్డుకి ఒకవంక నిష్కామ, నిర్వికార భావంతో తమ ప్రకాశాన్ని పంచిపెడుతూవున్న ఆ విద్యుద్దీపాలు! జనసంచారంలేని లోటును వూహించుకోలేక గుంపులు

గుంపులుగాచేరి దీపాలచుట్టూ నృత్యంచేస్తూ సౌరమండలాన్ని గుర్తుకుతెస్తున్న ఆ దోమలు! ప్రతిదోమకూడా తన నియమిత వలయంలో నక్షత్రంలా గిరికీలు కొడుతూవున్న ఆ దృశ్యం! ఆహా! ఎంత మనోహరంగా వుందంటేనూ! తడిసిన చెట్ల ఆకులు ఆ విద్యుద్దీపాలకాంతిలో మెరుస్తూ మనోహరంగా వున్నాయి.

కొంచెం ముందుకుపోయిన తరువాత రోడ్డుప్రక్కన వున్న వేపచెట్టుక్రింద ఒక తెల్లటివస్తువు కనపడింది. ఇంకొంచెం ముందుకుపోయిన తరువాత ఒకకుర్రాడు తెల్లటి చొక్కా, పాయజామా తొడుక్కొని, ఒకపళ్ళెం ముందు పెట్టుకొని యేమిటో అమ్మటానికి కూర్చున్నట్టు చూచాడు.

చిన్నతనంలో, అతడు యితరబాలురతో కలసి యిటువంటి ఫేరీవాళ్ళదగ్గర కొనుక్కొనితిన్నాడు. కాని యిప్పుడు వారితో అతనికెట్టి సంబంధమూ లేదు. కాని ఆచలిలో నిర్మానుష్యంగావున్న యీ ప్రదేశంలో అమ్ముకోవాలనుకునే యీ కుర్రాడు యెవడు?

ఈ ఫేరీవాలా ముడతలుపడ్డ శరీరం, వయస్సుకూడా అతని దృష్టిని సునాయాసంగా తమవైపు ఆకర్షించాయి. రాత్రి పూట బజార్లవెంట తిరిగి అమ్ముకునే యీవ్యాపారిదగ్గర దీపపు బుడ్డికూడా లేదు. అతడు యింకొంచెం దగ్గరకువచ్చి — ఆ పిల్లవాడు చలిలో ముడుచుకుపోయి, మూడంకెవేసి గడగడ వణుకుతూవున్నాడు. దిలీప్ దగ్గరకు పోవటంతో ఆ వాడు ఆశ్చ

దృష్టితో ఒకసారి అతనివంక చూచాడు. చూచి యథా ప్రకారంగా తల వంచుకున్నాడు. యేమనుకునో ?

ఆ కుర్రాడి ముఖాకృతిలో వుండవలసిన చతురతకు బదులు కాతరత ద్యోతకమవుతోంది. అతని పళ్ళెముకూడా ఫేరీవాళ్ళ పళ్ళెంలాంటిది కాకుండా సాధారణంగా ప్రతి యింటా వుపయోగించు మురాదాబాదీ పళ్ళెం. త్రాసుకూడా లేదు. పళ్ళెంలో యెనిమిది కాగితపు ముక్కలమీద పకోడీలు సమానంగా పెట్టబడి వున్నాయి.

బాకుల్లా పొడుస్తున్న యీ చలిలో మే మిద్దరమే బయట వున్నామని అనుకొన్నాడు దిలీప్. అతడు వాడి దగ్గరకు వెళ్ళాడు. వెళ్లి కంపించిపోయాడు. మానవునికి మానవునికి మధ్య యెంత భేదముంది ? కాని యీ తరతమభేదములను పాటించక ముందుకు పోగలిగింది ఒక మానవత్వం మాత్రమే. ఆ మానవత్వం ప్రతి మానవునిలోనూ తప్పక వుంటుంది. కాని ఒకొకరిలో నిద్రపోతూ వుంటుంది. మరొకరిలో మేల్కొని వుంటుంది. నిద్రపోతున్న వారిలోకూడా ఒకప్పుడు కాకపోతే మరొకప్పుడన్నా తప్పక మేల్కొంటుంది. దిలీప్‌ను దగ్గరలో చూచి ఆ కుర్రాడు ఆశా నేత్రాలతో చూస్తూ—"ఒకొక పోగు ఒకొక కానీ !" అన్నాడు.

కొద్ది క్షణాలపాటు ఆగి దిలీప్—"అన్నిటి ఖరీదు యెంత" అని అన్నాడు. ఆ కుర్రాడు పోగులను ఒకటి, రెండు, మూడు... అని లెక్కపెట్టి యెనిమిది కానులు అన్నాడు. దిలీప్ కేవలం

సందర్భాన్ని పొడిగించాలనే వుద్దేశ్యంతో—"ఏం? యిక యేమాత్రం తగ్గించవా?" అని అడిగాడు. అమ్ముడు పోతాయన్న వుద్దేశ్యంతో వున్న ఆ కుర్రాడిలో ఒక్కక్షణం ముందు వున్న సంతోషం యీ ప్రశ్నతో అడుగుకంటా తుడిచేయబడినది—"అమ్మ కోప్పడుతుంది" అన్నాడు.

ఈజవాబువిన్న దిలీపుని మనస్సు ద్రవించింది. మానవత్వం మేల్కొంది. అతడు-"ఈ డబ్బులను అమ్మకుయిస్తావా?" అన్నాడు.

కుర్రాడు తలూపి "ఊఁ" కొట్టాడు.

"అయితే అన్నీ యివ్వు" అన్నాడు దిలీప్. ఆ కుర్రాడి సంతోషానికి పట్ట పగ్గాలు లేవు. దిలీప్ తన జేబురుమాలా అందించాడు. కుర్రాడు వాటిని అందులో కట్టాడు.

ఎనిమిది కానుల వ్యాపారం చేసుకునేవాడి యింటి పరిస్థితి యేమిటి? ఇది ఆలోచించిన దిలీప్ వణకిపోయాడు. అతడు జేబులోని ఒక రూపాయిని తీసి కుర్రాడి పళ్ళెంలోకి విసిరాడు. ఆ రూపాయి గణగణలో సిస్తబ్ధంగావున్న శూన్యం ప్రతిధ్వనించింది. అట్టహాసంచేసింది ఆ రూపాయినిచూచి కుర్రాడు—"నా దగ్గర చిల్లర లేదండీ!" అన్నాడు.

"నీయిల్లు యెక్కడవుంది?"

"దగ్గరలోనే! ఒక సందులో!

దిలీపుని మనస్సులో అతని యింటిని చూడాలని కోర్కె కలిగింది. అతడు అన్నాడు—"పదా! నేనుకూడా అటే పోవాలి. మధ్యలో మీ యింటిదగ్గర చిల్లర తీసుకొంటాను."

కుర్రాడు గాబరాతో—"అన్ని డబ్బులు యింటివద్గర కూడా వుండవండి!" అన్నాడు.

దిలీప్—ఆ మాట విన్న దిలీప్ కంపించిపోయాడు—"వుంటాయిలే! నీవు నడువు!"

కుర్రాడు ఖాళీ పళ్ళెం రొమ్ము కానించుకొని ముందుకు నడిచాడు. వాడి వెనుక సైకిల్‌తో దిలీప్...

దిలీప్—"మీ అయ్య యేంచేస్తాడు?"

కుర్రాడు—"అయ్య చనిపోయాడు."

దిలీప్ మౌనంగా వుండిపోయాడు. యింకొంచెం ముందుకు పోయిన తరువాత దిలీప్ మరల—"మీ అమ్మ యేం చేస్తూ వుంటుంది?" అని తిరిగి ప్రశ్నించాడు.

కుర్రాడు—"అమ్మ ఒక బాబు యింటిలో అంటులు తోముతూ వుండేది. ఇప్పుడు అదికూడా లేదు" అని జవాబిచ్చాడు.

దిలీప్- "ఎందుకు తొలగించాడు?"

కుర్రాడు- "అమ్మ ఆపనికి రెండున్నరరూపాయిలు తీసుకొంటూ వుండేది. జగతూ అమ్మ రెండురూపాయిలకే చేస్తానంది. ఆ తరువాత అమ్మగారు అమ్మని తొలగించి జగతూ అమ్మను నియమించారు."

దిలీప్ మౌనంగా వుండిపోయాడు. కుర్రాడు ఆసందులో బురదలో టపటపకొట్టుకుంటూ త్వరత్వరగా వెళ్ళిపోతున్నాడు. దిలీప్‌కు ఆబురదలో వెళ్ళటం మహాకష్టంగావుంది. అందులో

సైకిల్ కూడావుండే! కుర్రాడినడకను తగ్గించటానికిగాను మరల తిరిగి– "నీకు చలివేయటంలేదా?" ప్రశ్నించాడు.

కుర్రాడు తన శరీరాన్ని మరింక వృద్ధి క్షపరచటానికిగాను నడకను యింకొంచెం పెంచుతూ — "ఊఁ హుఁ." అన్నాడు.

దిలీప్ తిరిగి ప్రశ్నించాడు— "జగతూతల్లి యేంచేస్తూ వుండేది!"

కుర్రాడు జవాబిచ్చాడు— "జగతూతల్లి స్కూలుకు పిల్లలను తీసికెళుతూ వుండేది. ఇప్పుడు స్కూలువాళ్ళు పిల్లలను తీసుకురావటానికి ఒకలారీని పెట్టుకున్నారు. ఆమెను తొలగించారు" అని.

ఆసందు మొగలో మునిసిపాలిటీదీపం వెలుగుతోంది. పైనుండి—అంతస్తులనుండికూడా కొద్దో గొప్పో ప్రకాశం వస్తోంది. ఆ ప్రకాశంలో సందులోని బురద మెరుస్తోంది. తద్వారా మార్గం కొంచెం అస్పష్టంగానన్నా కనబడుతోంది.

ఆ యిరుకైన సందులో ఒకపెద్ద కిటికీలావున్న దర్వాజా తలుపులు తెరచుకున్నాయి. తలుపులు తెరచుకునేటప్పటికి లోనుండి ప్రకాశం యెదురుగావున్న మొండిగోడమీద కొచ్చింది. దిలీప్ అది తనను చూడటానికే వచ్చిందేమో అనుకొని భయపడ్డాడు. కుర్రాడు లోనికిపోయాడు. దిలీప్ తొంగిచూచాడు. మనుష్యుని యెత్తులోనున్న ఆ పూరిగుడిసెలో—సాధారణంగా అది పిడకలగుడిసె అనిపించుకుంటుంది

—పమ్మిదపుబుడ్డి పొగనుగ్రక్కుతూ, తనశక్తికొలది ప్రకాశా న్నివ్వటానికి శాయశక్తులా కృషిచేస్తోంది. ఒకకుక్కిమంచం గోడ కానించి వుంది. ఆ మంచంకోడుమీద రెండుమూడు మురికి వస్త్రాలు వ్రేలాడుతున్నాయి. ఒక క్షీణకాయస్త్రీ శర్వాజా కానుకొని కూర్చొని వుంది.

కొడుకును చూచి తల్లి—" అబ్బాయి! బేరం అయి పోయిందంటరా ?" అడిగింది.

కొడుకు—"ఆ. అయిపోయింది" అంటూ రూపాయి చేతికిచ్చాడు—"మిగిలిన డబ్బులు అయ్యగారి కివ్వాలి."

రూపాయిని చూచి విస్తూపోయి "ఏ అయ్యగారు ! బాబు !" అన్నది.

కుర్రాడు అత్యుత్సాహంతో—"సైకిల్ బాబుగారు. అన్నీ తీసుకున్నారు. వారిదగ్గర చిల్లర లేదు. అక్కడ ఆయన గారు నిలబడి యున్నారు" అని జవాబిచ్చాడు.

తల్లి భయపడుతూ—"రూపాయికి చిల్లర యిక్కడ మాత్రం యెక్కడ దొరుకుతుంది? " అంది తలమీద ముసుగు పైకి తీసుకొంటూ—"బాబూ యీ రూపాయి తీసుకెళ్ళి అయ్య గారికిచ్చి వారి యిల్లు చూసిరా! రేపు పోయి తీసుకురావచ్చు."

కుర్రాడు దిలీప్‌నకు వాపస్ యివ్వటానికి బజార్లోకి వచ్చాడు.

దిలీప్ కొంచెం విసురుగా – తల్లికూడా వినేటందుకు— "పర్వాలేదు. వుంచుకో!" అన్నాడు.

తల్లి ముసుగును యింకొంచెం ముందుకు లాగుకొని–"వద్దండి. అబ్బాయి రేపు వచ్చి డబ్బులు తెస్తాడు" అంది.

దిలీప్ సిగ్గుపడుతూ–"వుండనివ్వండి! నేను యిచ్చానని కుర్రాడికి యివ్వండి" అన్నాడు.

తల్లి "వద్దు వద్దు" అంటూనేవుంది. దిలీప్ చీకటిలో వెనక్కు తప్పుకున్నాడు.

తల్లి, ముడతలుపడి ఓడిపోయిన ముఖమండలంపై 'కృతజ్ఞత, ప్రసన్నత' భావాలు వెల్లివిరిసాయి.

రూపాయి తన చెంగుకు కట్టుకొని ఒక రాతిమీద పెట్టబడిన యిత్తడి రేకుక్రింద మురికి గుడ్డలో చుట్టబడియున్న ఒక రొట్టె తీసి, కొడుకు కాళ్ళూ చేతులూ కడిగి తింటానికి యిచ్చింది.

కుర్రాడు తన క్షణికసంపాదననుచూచి మురిసిపోయాడు. అతడు ముఖం చిట్లించుకొని–"ఉఁహుఁ! యెండిపోయిన రొట్టె!" అన్నాడు.

తల్లి తల నిమురుతూ–"బాబు! వుప్పుకూడా వేసాను. తిను నాయనా!" అంది.

కుర్రాడు రొట్టెను నేలకేసి కొట్టి కోపంతో–"ఉదయం వండిన యెండిపోయిన రొట్టె! రోజూ అంతే!" అన్నాడు.

కాళ్ళమీద చేతులు పెట్టుకొని యేడుస్తానికి సిద్ధంగా వున్న అతన్ని తల్లి వొడిలోకి తీసుకొని–"నా నాయనవుగదూ! రేపు తప్పక పప్పు వండుతాను. ఇదిగో చూడు! అటుచూడు!

బాబు నీకు రూపాయి యిచ్చాడు, చూడు! నా బంగారానివి కాదూ? రేపు ప్రొద్దున్నే మంచి మంచి వస్తువులను తయారు చేస్తాను. నీవుకూడా తిందువుగాని లే!" అంది.

కుర్రాడు సంకోచించాడు—"అమ్మా! నీవు రొట్టెను తినలేదుగా" అని అడిగాడు.

కొంగును వుంగరాలుగా చుట్టుతూ తల్లి—"అవును నాయనా! నాకు ఆకలి వేయటం లేదు. నీవు తిను" అంది.

కుర్రాడు చిన్నవాడు కాబట్టి చిన్నతనంలో వుండవలసిన లక్షణాలనుబట్టి వాడు మొట్టమొదటయితే అలిగాడు. కాని వాడికి యింటి పరిస్థితులు బాగా తెలుసు. అందువలన ఆ అలుక కొద్ది క్షణాలలో మాయమయింది. వాడు రొట్టెను అమ్మ కందిస్తూ—"ఇదిగో, యీ రొట్టెను నీవు తీసుకోవమ్మా!" అన్నాడు.

తల్లి ప్రేమతో సవరించుతూ—"వద్దు నాయనా! నేను వుదయం ఆలస్యంగా తిన్నాను. అందువలన నాకు ఆకలి వేయటం లేదు. నీవు తిను!" అంది.

దిలీప్ యిక చూడలేకపోయాడు. పెదవులు కొరుక్కుంటూ వెనక్కు తగ్గాడు.

ఇంట్లో అడుగు పెట్టాడో, లేనే లేదో, నౌకరు వచ్చి యిద్దరు ముగ్గురి పేర్లు చెప్పి 'వచ్చి వెళ్ళిపోయారు' అన్నాడు. వంట అయిందనికూడా సూచించాడు. దిలీప్ అటు చూడకుండానే—"ఆకలి లేదు" అని చెప్పాడు.

అతనికి అప్పుడు కస్రాండి తల్లి—"ఆకలి లేదు" అని చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి.

నౌకరు వినమ్రత నొలికిస్తూ—"కొద్దిగా పాలు తీసుకు రమ్మంటారా?" అని అడిగాడు.

దిలీప్‌నకు అరికాలుమంట తలకెక్కింది. అతడు విదిలించు కుంటూ—"ఆకలి లేకపోతే పాలు త్రాగాలా? పాలు అంత తేలిక సరుకా?" అన్నాడు.

నౌకరుకి అర్థం కాలేదు. విస్తూపోయాడు.

దిలీప్ పళ్లు నూరుతూ "పోవోయి!" అన్నాడు.

పమ్మిద ప్రకాశంలో చూచిన ఆ దృశ్యం అతని కళ్ళెదుట ఆడుతూనే వుంది.

తమ్ముడువచ్చి—"వదినెగారు యీ జాబును పంపినారు" అంటూ కవరు దిలీప్‌న కందించాడు.

దిలీప్ కవరు చించి వుత్తరం తీసాడు. మొదటిలైనులోనే —నేను యీ జీవితంలో దుఃఖం అనుభవించటానికే జన్మించానసుకుంటాను...అని వ్రాసి వుంది.

దిలీప్ తరువాత చదవకుండానే వుత్తరం చించేశాడు. అతని తల బరువెక్కింది. అతడు తనలో తానే అనుకున్నాడు.

"దుఃఖం అంటే యేమిటో నీవు తెలుసుకుంటే యెంత బాగుండేది! నీవు మధురమైన దుఃఖం యీమాత్రమన్నా అనుభవించకపోతే బ్రతుకే బరువైపోయేది!"

"వల్లభ్"

# బలిదానం

అది జనరి నెల, ఆకాశంలో మేఘాలు పరుగులు తీస్తు న్నాయి. చల్లటి గాలి వీస్తోంది. అక్కడక్కడ వడగళ్ళుకూడా పడుతున్నాయి. థర్మామీటరు పాదరసం చాల క్రిందకువుంది. ఎత్తు పల్లాలుగావున్న ఆ రోడ్డుమీద కొంతమంది శవపేటికను ఎత్తుకు వెళ్లుతున్నారు.

శవపేటికతో పాటు ఒక యువకుడు—అతనివయస్సు షుమారు యిరవై అయిదు సంవత్సరాలు వుంటుంది. అతను ఓ రిక్షా లాగుతున్నాడు. అందులో యిద్దరు అమాయకులైన పిల్లలున్నారు. అతను వుదాసీనంగా వున్నాడు. వారు ఒక కంబళి కప్పుకొని యున్నారు.

ఈ శవం వారి అమ్మది. ఆ రిక్షా లాగే అతను వారి అయ్య. గత రాత్రి వారి ఆ చిన్న యిల్లు నలుగురితో నిండి పోయివుంది. అమ్మ కండ్లు మూసుకుంది. అయ్య అమ్మ చెయ్యి పట్టుకొని ఏడుస్తున్నాడు. యిదంతా వారు చూచారు. కాని వారు అమాయకులు! వారికి తెలియవు ఈ చావు బ్రతుకులు!

ఆ తరువాత తండ్రి పిల్లలను ముద్దు పెట్టుకొన్నాడు. వారికి ఏమీ చెప్పలేదు. వారిని రిక్షాలో కూర్చోపెట్టు కున్నాడు. వారు రోజుకుమల్లెనే షికారుకు వెళ్ళుతున్నా మను కున్నారు. కాని, తండ్రి హృదయంతో సంతోషంలేదు. అతడు

తలవంచుకొని బండిని లాగుతున్నాడు. ఇదంతా చూస్తుంటే వారికి జాలి కలిగింది.

పట్టణం దాటారు. ఇక యిప్పుడు అంధకారం! గాఢాంధకారం! వారి జీవితంలోనే గాఢాంధకారం! పిల్లలకు నిద్ర వచ్చింది...

లేచారు! దేవాలయంలో ఓ చాపమీద పండుకున్న ఆ పిల్లలు లేచారు! మరల రిక్షాలో కూర్చొని యింటికి తిరిగి వచ్చారు. కాని, వారికి అమ్మ కనపడలేదు. చిన్నవాడు అమ్మ కనపడనందుకు ఏడ్చాడు! ఏడ్చాడు...! సూర్యునికిరణాలు గదిలో పడ్డాయి! కిటికీదగ్గర తండ్రి నుంచొని యున్నాడు. అతనికళ్ళల్లో కన్నీరు! ఎదుట అంధకారం! గాఢాంధకారం!

♦ ♦ ♦

ఫిబ్రవరి చివరిరోజులవి! ఆకాశం ఖాళీగావుంది–మబ్బులు లేవు! మెరుపులు లేవు! గాలి హాయిగా, ఆనందంగా వుంది! వరండాకి ఎదురుగావున్న తోటలో పూలు విరబూచాయి! వాటి సువాసన నలువైపులా కమ్ముకుంది!

రిక్షాస్టాండులో బండ్లు వరుసగావున్నాయి. రిక్షావాళ్ళందరూ ఓచోట గుమిగూడావు, కబుర్లు చెప్పుకుంటున్నారు. అందులో కొంతమంది పుగాకు త్రాగుతున్నారు. దూరాన్నుండి బెల్ మ్రోగింది. ఒకడు 'పత్రిక' 'పత్రిక' అని అరచాడు.

అందరూ పత్రికను కొంటానికి ఎగబడ్డారు. రెండు రెండు కానులు పెట్టి అందరూ పత్రికను కొన్నారు. గోడమీద గుంపు ప్రోగయ్యింది.

'అందరూ యుద్ధంలో పాల్గొనాలి!' చదివారు. 'విధవ రాలి ఒంటరికొడుకు, రోగిష్టులు, స్త్రీలుతప్ప అందరూ యుద్ధంలోకి వెళ్ళాలి! పోరాడాలి! దేశాన్ని రక్షించాలి!'

'నా పిల్లలను ఎవరు పెంచుతారు! ఎవరు పెద్దవాళ్ళను చేస్తారు? ఎవరి కప్పచెప్పి వెళ్లాలి?' యిదే అతని ఆలోచన.

అతడు ఆ రోజంతా ప్రతి సందూ గడపగడప ఎక్కి గాలించి చూచాడు. కాని ఫలితం లేకపోయింది. అతని బిడ్డ లను, ఆ పసికందులను పెంచేవారు ఎవరూ కనపడలేదు. మరునాడు చిన్నబ్బాయిని వీపుకు కట్టుకొని, మిగిలిన యిద్దర్ని రిక్షాలో కూర్చోబెట్టుకొని 'నేడు నా పిల్లలను ఎవరికో యిస్తాను' అనుకుంటూ తిరిగాడు. కాని తీసుకునేవారు ఏరి? ఎవరికి వారే......! అతనికి సహాయం చేసేవారు ఎవరూ లేరు!

◆ ◆ ◆

అతడుపోయి సైన్యంలో తనపేరు వ్రాయించుకోవాలి! లేకపోతే జైలుజీవితం గడపాలి! ఒకవేళ పశువులా పదిమంది ముందూ తుపాకిగుండుకు బలిచేస్తే! ఎంత నైచ్యం! ఎంత సిగ్గుచేటు! యిదంతా ఆలోచిస్తుంటే అతడు వణికి పోయాడు.

మంచంమీాదనుండి లేచాడు. పిల్లలు ముగ్గురూ నిద్ర పోతున్నారు. దీపం మినుకుమినుకుమంటూ వెలుగుతోంది! ఆ ప్రకాశంలో అతనికి పిల్లల ముఖాలుకూడా కనపడలేదు. అతనికి తెలుసు! కత్తి ఎక్కడవుందో అతనికి తెలుసు !

అప్పను ఆ కత్తే! చిన్నప్పటినుండి అతనికి సాయపడ్డ ఆ కత్తే! ఎన్నో ప్రాణాలను బలికొంది! అతను దాని పదును చూచాడు. మెరుస్తున్న ఆ కత్తికి పదును బాగానేవుంది. కాని, అక్కడక్కడ తుప్పు పట్టినట్టువుంది. 'యింకొంచెం పదునుంటే బాగుంటుంది' అనుకున్నాడు అతను. పదునురాయి తీశాడు.

రాతిమీాద కత్తి అరగతీయబడుతోంది. అతడు ఆ ప్రకాశంలో—మసక మసకగా వున్న ఆ ప్రకాశంలో ఆ పసి కందుల మోమును చూడటానికి ప్రయత్నించాడు. నిద్ర! గాఢనిద్ర! సుఖదుఃఖాలను మరపించి మరో లోకంలోకి తీసుకు పోయే గాఢనిద్ర!

అంధకారం! భయంకరమైన అంధకారం! నేత్రాలు కూడా నిస్తేజమై పోయినవి. 'ముందు చిన్నవాడిని—ఒకవేళ వాడు లేస్తే! అరుస్తాడు. వాళ్ళిద్దరూకూడా లేస్తారు! నా కోర్కె నెరవేరదు! ఆహా! ఎంత కోమల కంఠము! కాని, నాకు తెలుసు! అమాయకులైన యీా పసికందులను ఎక్కడ కొడితే దెబ్బ తగలదో నాకు తెలుసు! ఆ తరువాత పెద్దవాడిని. నాబాహువులలోశక్తివుంది!—పెద్దవాడు లేవలేదుగదా!... లేదు! వాడు లేవలేదు! వాడు హాయిగా నిద్రపోతున్నాడు! ఇదే

వాడి అంతిమస్మృతి! అరే! మొన్ననేగదా వాడి జన్మ దినోత్సవం జరిపింది. వాడు గొప్పవాడు కావాలని, పేరు పొందాలని యింకా ఏమేమో అనుకున్నాను. కాని, నేడో...! అబ్బ!'

అతని చేతులు వణికాయి! చెమటలు కారుతున్నాయి–! 'నా యీ బాహువులలో యింత అసమర్థత వుందా? ఇవి వీటి కర్తవ్యాన్ని నెరవేర్చలేవా?' అని ప్రశ్నించుకున్నాడు. తన యీ అసమర్థతకు వ్యగ్రుడయ్యాడు. తననే నరుక్కుందా మనుకున్నాడు. కాని తను బ్రతకాలి! దేశంకొరకు బ్రతకాలి! జరగవలసిన కాండ జరిగిపోయింది. హత్యచేశాడు. శవాలను కంబళిలో చుట్టుకొని రిక్షాలో పెట్టాడు.

రిక్షా లాగుకుంటూ రోడ్డుమీదకు వెళ్ళాడు. కొద్ది రోజులకు పూర్వం అతడు అదే శ్రోనలో నడిచాడు. ఆరోజున అతడు కన్నీరు కార్చాడు కాని, నేడో?...నేడు అతనికళ్ళల్లో కన్నీరులేదు. ఆరోజు అతను యివి 'నా' వనుకునేవి చాలా వున్నాయి. నేడు ఏమీలేదు. అతనికి వుంది– అతని దేశం, అతని కర్తవ్యం!

ఆ సమయంలో రాత్రి పహారావుంది. అతడు పర్వ తాలలో దాగుడుమూత లాడుతున్న చంద్రుని ప్రకాశంలో పిల్లలను తల్లిదగ్గరకు చేర్చాడు...

పిల్లలు ఎంత హాయిగా నిద్రపోతున్నారు? వారిప్రక్కనే అతనికికూడా చోటుదొరికితే ఎంతబాగుంటుంది! కాని, యుద్ధం

అతనికొరకు నోరు తెరుచుకొని ఎదురుచూస్తోంది! అక్కడే సుఖం దొరికేది! అక్కడికే పోవాలి!

అతడు దేవాలయంలోకి చేరుకునే టప్పటికి వెలుతురు వస్తోంది! మెట్లక్రింద కుండీలో నీళ్ళున్నాయి! భగవంతుని దర్శనాలు చేసుకుని పాపాత్ములు అందులో స్నానంచేస్తే వారి పాపాలన్నీ పోతాయట! అతడు స్నానంచేసాడు.

అది మార్చినెల. పట్టణప్రజలంతా 'యుద్ధం' అని వింటుంటూనే వుప్పొంగి పోతున్నారు. పదివేల పతాకాల మీద అరుణకిరణాలు మెరుస్తున్నాయి. విజిల్ మ్రోగింది, సిపాయిలు పేర్లు—

'హాజరు.'—'హాజరు.'

ఆనందోత్సాహాలతో సైన్యం నినాదాలు చేసుకుంటూ ముందుకు పోతోంది. అతని సంతోషానికి పట్టపగ్గాలు లేవు! అతడు ఖూనీకాదు — దేశంకోసం ప్రాణాలను అర్పించే యోధానుయోధుడు...



